# కందుకూరి వీరేశలింగం

ధర్మాసుపత్రిలో పెరుగుతున్న అన్యాయాలను ఉన్నతాధికారులకు తెలియపరచి ధర్మవైద్యశాలను ఒక దారిలో పెట్టించాడు. ఒకరోజు వీరేశలింగం రాజవీధిలో వెడుతుండగా ఒక వర్తకుడు తన ఇంటిని పెంచి రోడ్డు మీదకు కట్టడం గమనించాడు.




మరునాడు వీరేశలింగం అదే దారిని వెడుతున్నాడు. ఆ వర్తకుడింకా ఇంటి ముందు కట్టడం పెరుగుతూనే ఉంది.




వెంటనే వీరేశలింగం మునిసిపాలిటీ ఆఫీసుకు వెళ్ళి ఉన్నతాధికారులతో ఈ విషయం చెప్పగా లంచం పుచ్చుకుని ఆ వర్తకుడికి కట్టుకొనుటకు అధికారం ఇచ్చినట్లుగా తేటపడింది. లంచం పుచ్చుకున్నవారి మీద చర్య తీసుకుంటామని అధికారులు మాటిచ్చారు —

వీరేశలింగం ఒక గునపం తీసుకొని ఆ వర్తకుడు కడుతున్న ఇంటిని పడగొట్టాడు —




మునిసిపల్ చైర్మనేగా ఉన్న దొరగారు వీరేశలింగాన్ని తన ప్రతినిధిగా ఉండమని కోరాడు.




ఆ పదవి స్వీకరించి వీరేశలింగం ఆ రోజు నుంచి ఊరు శుభ్రపరిచే ఏర్పాట్లు చేశాడు. లంచాలు పుచ్చుకోకుండా పనులు జరిగేటట్లుగా చర్య తీసుకున్నాడు. [illegible] చాడు. తనే బాధ్యత వహించాడు.




ఆ రోజుల్లోనే 'సతీహిత బోధిని' అనే స్త్రీలకొక మాస పత్రిక ప్రారంభించాడు —



ఇన్ని కార్యాలు చేపట్టినా, అనారోగ్యంగా ఉన్నా, గ్రంథ రచన సాగిస్తూనే ఉన్నాడు. ఈ కాలంలో అనేక గ్రంథాలు రచించాడు.




(తరువాయి 3 వ కవరు పేజీలో)

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 21 | మే, 1977 | వైశాఖ-జ్యేష్ఠ, 1899 శా.శ. | సంచిక : 6

ప్రధాన సంపాదకులు :
శ్రీరాజ్యం సిన్హా

సంపాదకులు :
కుందుర్తి ఆంజనేయులు

ముఖ చిత్రం : సంఘ సంస్కర్త
కందుకూరి వీరేశలింగంగారు.

రెండు, మూడు కవరు పేజీలు: కందుకూరి వీరేశలింగం జీవిత చరిత్ర
(బుజ్జాయి బొమ్మల చిత్రాలు)

చివరికవరు పేజీ : అందరికీ అందుతున్న అనాబ్‌షాహి
ద్రాక్షగుత్తులు

## ఈ సంచికలో...

పేజీ



వెల: 50 పైసలు

సాలుచందా : ఆరు రూపాయలు

ప్రచురణ :
డైరెక్టర్,
సమాచార, పౌర సంబంధ శాఖ,
హైదరాబాద్

ముద్రణ :
డైరెక్టర్,
ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం,
హైదరాబాద్.

రిజిష్టరు నెం : హెచ్. హెచ్. డి. 81



5–1



# వికసించే కుసుమాలు



—శ్రీమతి అడవికొలను పార్వతి

తర తరాల ధనికవాద మనస్తత్వం పేరుకుపోయి
కుటతత్వం, కలతత్వం పాతుకుపోయి
ప్రాణం కన్నా, మానం కన్నా
ధనాన్నే మిన్నగా చూసుకునే
వాళ్ళు కొందరున్నారు
వీళ్ళ యిళ్ళల్లో
పిల్లల్ని పెంచడం తల్లులకి నామోషీ!
తల్లులకి సేవచేయడం పిల్లలకి అవమానం
తల్లీ కూతుళ్ళ అనుబంధాల మధ్య
అక్కా చెల్లెళ్ళ అభిమానాల మధ్య
ఆస్తులు, అంతస్తులు ముళ్ళబాటలు పరుస్తాయి
అన్నదమ్ముల రక్తబంధాలు
ఆస్తి సంబంధాల ఖడ్గాలచేత
ఖండ ఖండాలుగా చీల్చబడతాయి
శ్రామికులకి
అపేక్షలూ, అంతఃకరణలే ఆస్తి
ధనవంతుల
ఆపేక్షలూ, అంతఃకరణాలూ ఆస్తులే!
కార్మిక స్త్రీలకి
స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సిగలో వికసించే కుసుమాలు!
కలవాళ్ళ
పురుషుల యినప్పెట్టెలో మగ్గిపోయే ఆభరణాలు!
తండ్రి కుదిర్చిన యిష్టంలేని మనువుకి
భర్త వ్యసనలోలుడై పెట్టేహింసకి
స్త్రీ బ్రతుకు ఒక బలిపీఠం!
స్త్రీని దాచిన బంగారు పంజరానికి
తాతముత్తాతల హోదాలు, అంతస్తులే విరచరాని ఊచలు!
ఈ విషవలయాల్ని ఛేదించలేక
పూర్వకర్మ విశ్వాసాంధకారంలో
మనసు మరుగు పరచుకుని
సహనమనే చేతగాని తనాన్ని
నిరంతరంగా సాధిస్తున్నారు స్త్రీలు!
అవసరాన్ని మించి పేరుకున్న ఆస్తి
మానవత్వాన్ని మంట గలిపి
దానవత్వానికి దారితీస్తుంది!
అక్రమంగా ఆస్తులు పెంచే అమానుషత్వాన్ని
అక్రమంగా శ్రమను దోచుకునే రాక్షసత్వాన్ని
అతి తీవ్రంగా ఎదుర్కొని నేలగూల్చాలి!
అందరూ సమానంగా జీవించే వ్యవస్థను నిర్మించాలి!



# మన కొత్త గవర్నరు





ఆంధ్ర ప్రదేశ్ గవర్నరుగా నియమితులైన

శ్రీమతి శారదా ముఖర్జీ

మే 5వ తేదీన గవర్నరుగా పదవీస్వీకారం చేశారు

శ్రీమతి శారదా ముఖర్జీ బొంబాయిలోని కెథడ్రల్ బాలికోన్నత పాఠశాలలోనూ, ఆ తర్వాత ఎలిఫిన్‌స్టోన్ కళాశాల, న్యాయ కళాశాలల్లోనూ (బొంబాయి విశ్వవిద్యాలయం) విద్యాభ్యాసం చేశారు. ఆమె అర్థశాస్త్రంలో బి. ఏ. ఆనర్స్ డిగ్రీ పొందారు. న్యాయశాస్త్రం కూడా అభ్యసించారు.

ఆమె శ్రీ సీతారామ్ పండిట్ కుమార్తె. 1919 ఫిబ్రవరి 24న బొంబాయిలో జన్మించారు. శ్రీమతి విజయలక్ష్మీ పండిట్‌కు దగ్గరిబంధువు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అప్పటి స్క్వాడ్రన్ లీడర్ సుబ్రతో ముఖర్జీని వివాహమాడారు. ఆయన ఆ తర్వాత ఎయిర్ చీఫ్ మార్షల్ పదవికి చేరుకున్నారు. భారత వైమానిక దళం ప్రధానాధికారి అయిన ప్రప్రథమ భారతీయుడు. 1960 నవంబరులో విధి నిర్వహణపై టోకియో వెళ్ళి అక్కడ దుర్మరణానికి గురి అయ్యారు.

శ్రీమతి శారదా ముఖర్జీ అనేక సంవత్సరాలుగా సాంఘిక సేవా కార్యకర్తగా వ్యవహరిస్తున్నారు. చెషైర్ హోమ్స్ ఇండియా ట్రస్ట్ సభ్యులుగానూ, సెంట్రల్ ట్రస్ట్ సభ్యులుగానూ, భారతీయ వైమానికదళం సంక్షేమ సంఘం కార్యనిర్వాహక సభ్యులుగానూ వ్యవహరిస్తున్నారు, అప్పటి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షతన ఉన్న ఢిల్లీలోని పౌరకేంద్ర సంఘంలో ఒక భాగంగా ఉన్న సాయుధదళాల సంక్షేమసంఘం అధ్యక్షురాలుగా కూడా వ్యవహరించారు. పరిపాలన సంస్కరణల సంఘంలో ప్రణాళికా, రక్షణ విషయాల అధ్యయనబృందం సభ్యురాలుగా కూడా ఆమె వ్యవహరించారు.

1962లోనూ, 1967 లోనూ కాంగ్రెస్ టికెట్‌పై ఉత్తర రత్నగిరి నియోజకవర్గం (మహారాష్ట్ర) నుండి లోకసభకు ఎన్నికయ్యారు.

ఆమె అఖిల భారత కాంగ్రెస్ సంఘం సభ్యురాలుగానూ, అవిభక్త కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఎగ్జిక్యూటివ్ సంఘం సభ్యురాలుగానూ వ్యవహరించారు. 1969లో కాంగ్రెస్‌లో చీలిక ఏర్పడిన తరువాత ఆమె కాంగ్రెస్ (ఓ)లో చేరారు. అది ఇప్పుడు జనతాపార్టీలో భాగంగాఉంది. పార్లమెంటు సభ్యురాలుగా ఆమె జాతీయ షిప్పింగ్ బోర్డు వంటి ముఖ్యమైన సంఘాలలోనూ, రక్షణ మంత్రిత్వశాఖ సలహా సంఘం వంటి పార్లమెంటరీ సంఘాలలోనూ సభ్యురాలుగా వ్యవహరించారు. జాతీయ చిన్నతరహా పొదుపు సలహా సంఘంలో అధ్యక్షులుగా కూడా ఉన్నారు. ఆర్థిక వ్యవహారాలలోనూ, తత్వ శాస్త్రంలోనూ, సంస్కృత సాహిత్యంలోనూ, రక్షణ వ్యవహారాలలోనూ ఆమెకు అత్యంత ఆసక్తి ఉన్నది. దానితోపాటు రక్షణ, రాజకీయ సమస్యలపై ఆమె వ్యాసాలు ప్రచురించారు. క్రీడలు, సంగీతం, పఠనంలో ప్రత్యేకశ్రద్ధ ఉంది. యూరప్, అమెరికా, పశ్చిమ ఆసియా, దూర ప్రాచ్య దేశాలలో విస్తృతంగా పర్యటించారు. పశ్చిమ జర్మనీ, యు. కె., సెనగల్ దేశాలకు పార్లమెంటరీ ప్రతినిధివర్గ నాయకురాలిగాను, సోవియట్ యూనియన్ అవుటర్ మంగోలియా మొదలైన దేశాలకు ప్రతినిధివర్గ సభ్యురాలుగా వెళ్ళారు.

# గ్రామీణ పారిశ్రామికీకరణ

డాక్టర్ ఆర్. వి. రావు

భారతదేశంలో 6.76 లక్షల గ్రామాలున్నాయి. 60 కోట్ల జనాభాలోను, 80 శాతం గ్రామసీమలలోనే వున్నారు. జాతీయాదాయానికి, గ్రామీణ ప్రాంతాలు 50 శాతానికి పైగా వనరులు సమకూరుస్తున్నాయి. 1973–74లో గ్రామసీమలనుండి 49,290 కోట్ల రూపాయల ఆదాయం వచ్చింది.

విపరీతంగా పెరుగుతున్న జనాభాకు, వ్యవసాయంలో ఉపాధి సౌకర్యాలు యిచ్చే అవకాశాలు సన్నపడటంతో, పరిశ్రమల వైపు మన దృష్టిని చూపవలసి వచ్చింది. మిలియన్లు నిరుద్యోగులుండటం వారిలో చదువుకున్నవారి సంఖ్య హెచ్చుగా ఉండటం వలన వ్యవసాయేతర వృత్తులలోకి వారిని తరలింపవలసిన సమయం వచ్చింది. పారిశ్రామిక రంగంలో మనం సాధించిన ప్రగతి ఘనమైనది. 1961తో పోల్చిచూస్తే, 1974లో 274 శాతం సాధించాం. కాని మన వద్దనున్న వనరులు, ముఖ్యంగా పెట్టుబడి తక్కువగా వున్నందున గ్రామసీమల అభివృద్ధికి యిక ముందు హెచ్చుగా తోడ్పడవలసి వున్నందున, అచ్చటి స్థానిక వనరులు అభివృద్ధిచేసి, ఉద్యోగావకాశాలు హెచ్చు చేయాలి. గ్రామీణ పారిశ్రామికీకరణలో చిన్న పరిశ్రమలు సహాయ పడతాయి. సాంకేతిక విధానంలో కూడా మనకు తగినది, లాభదాయకమైనది చూసుకొని అనువర్తించాలి.

మార్కొపోలో మన దేశానికి వచ్చినప్పుడు, మంచి కాటన్ (నూలు) బట్టలు మనవారు ఎగుమతి చేసేవారని వాటిని సాలెగూడుతో పోల్చవచ్చని అన్నాడు. ఎంత మందో విదేశీయులు, మనయొక్క నూలుబట్టలు, కలంకారీ వస్త్రాలు, నరసాపురం, బందరు రేవు పట్నాలనుండి ఎగుమతి అయేవని వ్రాశారు. మన దేశం అందులోను ముఖ్యంగా మన రాష్ట్రం, ఒక వ్యవసాయానికే నోచిపుట్టలేదని, వ్యవసాయరంగంలోనేకాక పరిశ్రమల రంగంలోకూడా మంచి ప్రగతి సాధించామని మనం తెలిసికోవాలి. ఇట్టి ఘనమైన ప్రగతి సాధించిన ప్రజలు, దానిని మరువరాదు. భారతదేశంలో చాలామంది ప్రజలు గ్రామసీమలలో వున్న విషయం మనం మరువరాదు.

గ్రామసీమలలోని ప్రజలు పొట్ట చేత పట్టుకొని పట్టణాలకు తరలి రావటంవల్ల, పట్టణాలలో గృహ సమస్య, పని అవకాశ సమస్య, రహదారి సౌకర్యాల సమస్య మొదలగు సమస్యలు ఎన్నో ఏర్పడ్డాయి. గ్రామసీమలలో పనిచేసేవారు లేరు. ఇన్ని ప్రణాళికలు పూర్తి అయినా, 1975–76లో, మన సరాసరి రాబడి సాలీనా 371 రూపాయలకు మించలేదు. ఈనాటి ప్రపంచ ఆర్థిక సమాజంలో కొంత మందే దేశ సంపదను అనుభవిస్తున్నారు. అది జరగాలంటే చాలామంది పేదరిక బాధలో మునిగి వుండవలసివున్నది. మారుతూన్న సమాజం, ముఖ్యంగా మన సమాజం, దానిని సహించదు సమాజంలో ఆర్థిక సమానత్వం, ఆర్థిక న్యాయం ఉండాలి.

## గ్రామీణ పరిశ్రమల ఉద్యమం

భారతదేశంలో చాలామంది గ్రామసీమలలో వున్నారని, గ్రామాభ్యుదయానికి మనం తోడ్పడాలని గాంధీజీ చెప్పారు. ఆర్థిక ప్రణాళికలలో గ్రామసీమలకు ప్రత్యేక స్థానం ఉండాలనేవారు. "గ్రామాలకు తరలిపోండి" అనటంలేదని, పట్టణాలు గ్రామ సీమలలో తయారయిన సరుకులను కొనాలికాని, వాటితో పోటీ పడరాదని, మన ఆర్థిక సమస్యలను సరిగా తెలిసికోవాలని, "పెద్ద పరిశ్రమలు అభివృద్ధి చెయ్యలేక నశించు" అనచ్చుకాని, దీని పర్యవసానం ఏమవుతుందో గుర్తించాలని గాంధీజీ చెప్పారు. ప్రణాళికల రచనయొక్క ముఖ్యోద్దేశం, ఉద్యోగావకాశాలు కల్పించి పేదరికం పోగొట్టటం, న్యాయ పద్ధతిలో తయారయిన సరుకులు పంచటం అయివుంది. ఖాదీ గ్రామీణ పరిశ్రమలు దేశ స్వాతంత్ర్యానికి, సమానత్వానికి తోడ్పడుతాయని ఉత్పత్తి వికేంద్రీకరణం అవాలని, స్థానికంగా లభ్యమయ్యే వనరులు మనం ఉపయోగించాలని, దానితో మన నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయవచ్చని ఆయన అన్నారు. గాంధీజీ అఖిల భారత గ్రామీణ పరిశ్రమల సంఘానికి అధ్యక్షులు. ఆనాడు నేనుకూడ కొంతకాలం అక్కడ వుండే అదృష్టం ప్రాప్తించింది. విద్యుచ్ఛక్తి ఉపయోగించినా, ఆయనకు అభ్యంతరం కాదని, కాని దాని వలన ఎవరికీ పని అవకాశాలు పోకూడదని ఆయన వాదన. దీనిలో చాల సత్యముంది. ఇతర పద్ధతులలో, పని అవకాశాలు యివ్వదగినచో తన నిర్మాణ కార్యక్రమానికి స్వస్తి చెప్తానన్నాడు. ఆచార్య వినోబాభావే కూడా, తన చర్కాను ముక్కలుచేసి, ఒకపూట వంటకు ఉపయోగించటానికి సిద్ధంగా ఉ[illegible]న్నానన్నాడు.

నిజంగా చూస్తే, 6వ ప్రణాళిక పూర్తి అయేసరికి 40 మిలియనుల మందికి పని అవకాశాలుండవని అంచనా వేయబడింది. పండిత జవహర్‌లాల్ నెహ్రూ కూడ 1963 నవంబరు 11వ లోక్ సభలో మాట్లాడుతూ, ప్రణాళికలవలన చాలా మంది, కొంత లాభం పొందినా, చాలామంది భరింపరాని పేదరిక బాధలో ఉండటం,

తనకు ఎంతో బాధ కలిగిస్తున్నదని, దానికి ఒక మార్గం కనిపెట్టాలని అన్నారు. గాంధేయ విధానం గురించి, ఆయన ఆలోచిస్తానని కూడా అన్నారు. భారతదేశం, పారిశ్రామికంగా అభివృద్ధి అయిన దేశాల పద్ధతులు, ముందు వెనక్క చూడకుండా, అవలంబించకుండా, గాంధేయ విధానం అమలు జరుపుతే మంచిదని అంతర్జాతీయ ఆర్థికవేత్త శ్రీ రోప్కే తన "హ్యూమన్ ఎకానమీ"లో వ్రాసిన మాటలలో చాలా సత్యముంది. పెద్ద పెట్టుబడి పెట్టిన పరిశ్రమలే, పెరుగుతున్న జనాభా గల, పేదరిక బాధలో వున్న భారతదేశ ప్రజానీకానికి శరణ్యమని అనుకోటం తప్పుని. స్థానికంగా లభ్యమయే వనరులు ఉపయోగించుకొని గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి చేస్తే, ఉద్యోగావకాశాలు హెచ్చు యివ్వవచ్చని G. D. H. Cole గారు కూడ వ్రాశారు. మనకు విస్తారం పనిచేసే వారున్నారు. పెట్టుబడి తక్కువగా వుంది. కనుక మనం ప్రజలకు పని కలిగించే సాంకేతిక విధానాన్ని అమలు జరపాలి. ఇది యేంతమాత్రం కష్టం కాదు.

గ్రామసీమలలోని కార్మికులకు చేతినిండా పని ఉండటం లేదు. కొంతమందికి అసలే పనిలేదు. వాటికి ప్రభుత్వం కనీస వేతనాలు నిర్ణయించినా, అవి అమలు జరపటం చాల కష్టంగా వుంది. ఉత్పత్తి ఉపయోగం సానికం చేస్తే, ప్రజల కోరికలు కూడ కొంత తగ్గించవచ్చు. ఉత్పత్తి ప్రజానీకానికని, ఉత్పత్తి పెద్ద ఎత్తునకాదని గాంధీజీ చెప్పేవారు. నిజంగా చూస్తే, పరిశ్రమల అభివృద్ధియొక్క ముఖ్యలక్ష్యం ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కలుగచేయడమని మనం గుర్తించాలి. చిన్న పరిశ్రమలలో, పనివారలకు పనిలో సాంకేతిక జ్ఞానం యివ్వడానికి సరాసరి 3000, 4000 రూపాయలకంటే ఖర్చు పెట్టనక్కరలేదు. పెద్ద పరిశ్రమలలో చాల డబ్బు ఖర్చు పెట్టాలి. ఉద్యోగావకాశాలు కూడ హెచ్చు ఇవ్వలేవు.

## సాంకేతిక విజ్ఞానం

పాశ్చాత్య దేశాలలో అనుసరిస్తున్న సాంకేతిక మార్గాలు, మనకు సరిపడవని, ఆలోచించి మనం అనుసరించాలని, కీ॥ శే॥ ఫకృద్దీన్ అలీ అహ్మద్‌గారు చెప్పిన మాటలలో చాల సత్యమున్నది. పేదరిక బాధలో మునిగి తేలుతున్న దేశంలో, డబ్బుగలవారికి కొన్ని దీవులుంటే లాభం లేదన్నారు. మధ్యేమార్గ సాంకేతిక విజ్ఞానం మన దేశానికి కావాలి. దాన్ని మనం, ముఖ్యంగా గుర్తించి అనుసరించాలి. భారత సాంకేతిక మండలి అధ్యక్షులు డాక్టర్ నాయుడమ్మగారు కూడ బెల్గాంలో మాట్లాడుచూ, గాంధేయ మార్గానికి గొప్ప విలువ వున్నదన్నారు. ఇది శుభ సూచన అనాలి.

## ఆంధ్రప్రదేశంలో గ్రామీణ పారిశ్రామికీకరణ

భారత ప్రభుత్వం వారు, 1962-63 లో, గ్రామీణ పారిశ్రామిక ప్రాజెక్టులు అమలు జరిపారు. ఈనాడు వివిధ రాష్ట్రాలలో 111 ప్రాజెక్టులు ఉన్నాయి. ప్రజలు గ్రామసీమల నుండి తరలి రాకుండా చూస్తూ, గాంధేయ తదితర మార్గాల ద్వారా, గ్రామాలలోని వనరులు అభివృద్ధి చేసి, ఉత్పత్తి పెంచి, ప్రజలకు హెచ్చు ఉద్యోగ అవకాశాలు యివ్వటమే యీ పథకంయొక్క ముఖ్యోద్దేశం. ఈ 111 ప్రాజెక్టులలోను 7 పథకాలు ఆంధ్రప్రదేశంలో ఉన్నాయి. 1962-63 లో నల్గొండ, నరసరావుపేట, అనంతపురంతో మొదలుపెట్టి 1972లో కరీంనగర్ చేర్చి, 1973లో శ్రీకాకుళం, కడప, ఖమ్మం జిల్లాలను చేర్చుకొని, మొత్తం 7 జిల్లాలలోని గ్రామసీమలలో మనం యీ పథకాన్ని అమలు జరుపుతుంటున్నాం. భారతదేశానికల్ల, నల్గొండ జిల్లాలో నెలకొల్పబడ్డ 3000 యూనిట్లు చూస్తే, యిన్ని యూనిట్లు ఏ యితర రాష్ట్రంలోను స్థాపింపబడలేదని తెలుస్తోంది. ఆంధ్రప్రదేశానికి మొదటి స్థానం వచ్చింది. ఆంధ్రులు గర్వింపదగిన విషయం. భారతదేశంలో మూడవ స్థానం కూడ అనంతపురానికి దక్కింది.

8 వేల వ్యక్తులకు, 74 లక్షల రూపాయల ధన సహాయం దొరికింది. చిన్న పరిశ్రమ అభివృద్ధికి బ్యాంకులు 6600 వ్యక్తులకు 67 లక్షల రూపాయలు యిచ్చాయి. నవీన శాస్త్ర సమ్మతమైన పనిముట్లకు 13 లక్షల రూపాయలు ఖర్చు పెట్టారు. 8000 మందికి లాభం జరిగింది. కొంతభాగం గ్రాంటు క్రిందకూడ యిచ్చారు. స్థానిక వనరుల మీద ఆధారపడిన, ప్రజలకు కావలసిన సరకులమీద ఆధారపడిన, అనేక పరిశ్రమలు ఎన్నో స్థాపింపబడ్డాయి.

## ఖాదీ గ్రామీణ పరిశ్రమలు

భారత ప్రభుత్వం నెలకొల్పిన వివిధ బోర్డులు కూడ యీ కార్యక్రమంలో ముందంజ వేయాలని భారత ప్రభుత్వం నిర్ణయించింది. ఖాదీ గ్రామీణ బోర్డు యీ విషయంలో ఎంతో తోడ్పడగలదు. దీనికి కారణం, గాంధేయ సిద్ధాంతం ప్రకారం యివి పనిచేస్తున్నాయి. నూనె గానుగలు అనండి, దంపుడు బియ్యం అనండి, ఖండసారి చక్కెర అనండి, యివన్నీ గ్రామసీమల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడ గలవు. రాష్ట్ర ఖాదీ బోర్డు యీ విషయంలో ఎంతో శ్రద్ధ చూపుతోంది.

పొందూరులో, నాణ్యమైన అతి సున్నితమైన ఖద్దరు ఉత్పత్తి అవుతుంది. ఇటువంటిది యితర రాష్ట్రాలలో తయారవదు. ఇచ్చటి కార్మికాభివృద్ధి సంఘం 2000 మందికి గ్రామసీమలలో పని కల్పిస్తోంది. సుమారు 4 లక్షల రూపాయలు 1975-76 లో వేతనాలు క్రింద యిచ్చారు. ఎమ్మిగనూరులో చెప్పుల తయారీ, యితర గ్రామీణ పరిశ్రమల యూనిట్లను చూసి శ్రీ థామస్ చాల సంతోషించారు. వికేంద్రీకరణ సిద్ధాంతంలో యీ యూనిట్లు పని చేస్తూ, గ్రామీణ పారిశ్రామికాభివృద్ధికి ఎంతో తోడ్పడుచున్నాయి.

ఇక గుంటూరులో, గుంటూరు జిల్లా ఖాదీ గ్రామోద్యోగ సంస్థను కూడ సందర్శించారు. ఇచ్చట కూడ సాలీనా 7 లక్షల రూపాయల విలువ గల ఖద్దరు ఉత్పత్తయి, అమ్ముడవుచున్నది. గ్రామ సీమలలో 1000 మందికి పైగా ఉపాధి సౌకర్యం కలుగుతోంది. సంఘం లాభం మీద పని చేస్తుంది. ఖాదీ గ్రామీణోద్యమ పరిశ్రమల ప్రత్యేకత ఏమిటంటే తక్కువ పెట్టుబడితో, గ్రామ

సీమలలోని వనరులను ఉపయోగించి, హెచ్చు మందికి ఉపాధి సౌకర్యాలు యిచ్చి, గ్రామసీమల నుండి నిరుద్యోగ సమస్య దూరం చేయవచ్చు. గ్రామసీమలలో పారిశ్రామికాభ్యుదయం తెచ్చే మార్గం యిదేనని చెప్పాలి.

మన రాష్ట్రంలోని ఖద్దరు, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి గురించి గాంధీజీ ఎంతో కొనియాడారు. మన రాష్ట్రంలోని వివిధ గ్రామీణ పారిశ్రామిక పథకాలలో, ఖాదీ గ్రామీణ పరిశ్రమలు, హెచ్చు స్థాయిని నెలకొల్పితే ఎంతో బాగుంటుంది. అంబరు చర్ఖా కార్యక్రమం కూడ బాగా అమలు జరుపవచ్చు. తిరుచానూరులో, చేనేత పారిశ్రామికుని గృహం కూడ థామస్ గారు చూశారు.

పెద్ద పెట్టుబడి పరిశ్రమలలో ఉద్యోగావకాశాలు చాలా తక్కువ. చిన్న పెట్టుబడి పరిశ్రమలలో ఉద్యోగావకాశాలు హెచ్చు. ఖాదీ కమిషన్ వారు 19 లక్షల మందికి ఉద్యోగావకాశాలు, 1972-73 లో కల్పించారు. 36 కోట్ల రూపాయలు వేతనాలు క్రింద యిచ్చారు. ఉత్పత్తి విలువ 140 కోట్ల రూపాయలు గ్రామసీమలలో 130 మిలియనులకు ఉద్యోగావకాశాలు [illegible] 19 లక్షలు ఎంత అని ప్రశ్న వేయవచ్చు. ఇంత [illegible]కు ఐనా, ఖాదీ కమిషన్, యీ సమస్య పరిష్కారం చేసిందని, యింకా సదుపాయాలు యిస్తే, యింకా పనిచేయ గలదని వ్రాయాలి.

## సిల్కు పరిశ్రమ

మన రాష్ట్రంలో మొన్నటి దాకా మల్బరీ సిల్కు ఉత్పత్తి అనంతపురం, చిత్తూరు జిల్లాలలో మాత్రమే ఉండేది. ఇది చిన్న సన్నకారు రైతులకు కల్యాణ కల్పతరువు. ఒక్కసారి మల్బరీ వేస్తే చెట్టు 10, 12 సంవత్సరాలు బ్రతుకుతుంది. సంవత్సరానికి, 4, 5 పంటలు వస్తాయి గనుక రైతులు అప్పుల పాలవ నక్కర లేదు. ఇది వ్యవసాయ గ్రామీణ పరిశ్రమ. గత సంవత్సరం మల్బరీ ఉత్పత్తి లో 2,000 అదనపు ఎకరాలు గ్రామసీమలలో చేర్చారు. రైతుకు ఖర్చులు పోను 5, 6 వేలు రూపాయలు సాలీనా మిగులుతుంది. మన పట్టుకాయలు, కర్ణాటక రాష్ట్రంలో అమ్ముతున్నారు. వీటి నుండి దారం తీస్తే మనకు మంచి లాభం. దారాన్ని మనం పట్టుబట్ట నేయటానికి ఉపయోగించవచ్చును. పట్టు పరిశ్రమల సమాఖ్య కూడ పెట్టారు. ఇది పట్టు కాయలు ఉత్పత్తిదారుల దగ్గరనుండి సరసమైన ధరలకు కొంటుంది. మొదటి సంవత్సరం దీనికి 50 వేల రూపాయల లాభం వచ్చింది. గ్రామసీమలు పారిశ్రామికంగా అభివృద్ధిచేయుటలో, పట్టు పరిశ్రమ మంచి దోహద మిస్తోంది.

ఈ పరిశ్రమ రాష్ట్రంలో అనేక యితర కొత్త ప్రదేశాలలో పెట్టవచ్చు. హైదరాబాదు చుట్టూ 500 యకరాలు, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో 500 యకరాలు, కడప, నెల్లూరు ప్రాంతాలలో 100 యకరాలు, మల్బరీ సాగులోకి వచ్చాయి. ఈ గ్రామీణ వ్యవసాయిక పరిశ్రమవలన వేలాది వ్యవసాయ కార్మికులకు, చిన్న సన్నకారు రైతులకు ఉపాధి సౌకర్యాలు కలుగుచున్నవి. అంతే కాదు రెండు మూడు నెలలకు ఒక పంట రావటంలో రైతులు అప్పుల పాలవవక్కరలేదు. ఈ పరిశ్రమలో ఘనమైన అభివృద్ధి సాధించాం. ఇంకా సాధించాలి. మనరాష్ట్రంలోనే పట్టు చేనేత పనివారలకు ఎంతోపట్టుదారం కా[illegible]లి.

టసారు సిల్కు పరిశ్రమ, అటవీ పరిశ్రమ. కొండజాతుల వారికి ఉపాధి యిస్తుంది. మన రాష్ట్రంలో సల్లమద్ది చెట్లు చాల ఉన్నాయి. చెట్లమీద టసర్ పురుగుల పెంచి, పట్టు కాయలు చేయవచ్చు. పోతిరెడ్డిపల్లిలో సాలీనా, టసర్ సిల్కు 1 లక్షరూపాయల విలువ గలది తయారవుతోంది ఖాదీ కమిషన్ అధ్యక్షుడు థామస్ గారు యీ మధ్యనే యీ సంఘాన్ని చూశారు బంగారువన్నెగల పట్టుకాయలుచూసి చాల సంతోషించారు వారికి కావలసిన పట్టు కాయలు సరసమైన ధరలకు సప్లయి చేయాలి. టసర్ సిల్కుకు విదేశ మార్కెట్లు కూడ ఉన్నాయి.

చిన్న పరిశ్రమ బోర్డు పారిశ్రామిక వాడలు పెట్టుటలోను, చిన్న పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుతుంది. చేతి పరిశ్రమల బోర్డు చేతి పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుతుంది. ఆంధ్రప్రదేశంలో ఉన్నవన్ని చేతి పరిశ్రమలు ఏ యితర రాష్ట్రంలోను లేవు. ఇవి అంద చందాలకు పెట్టింది పేరు. గ్రామసీమల ఆర్థికాభివృద్ధికి ఎంతో తోడ్పడుచున్నాయి. కొండపల్లి బొమ్మలు, నిర్మల్ బొమ్మలు, బందర్ కలంకారీ, ఏటికొప్పాక బొమ్మలు, నెల్లూరు చాపలు ఏలూరు, వరంగల్ కార్పెట్లు, చేనేత బట్టలు, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు యిచ్చుటలో ఎంతో తోడ్పడుచున్నాయి మన రాష్ట్రంలో 6 లక్షలకు పైగా చేనేత మగ్గాలున్నాయి. అంద చందాల చీరెలు తయారవుతున్నాయి. రెడీమేడ్ దుస్తులు కూడా మనం విదేశాలకు ఎగుమతి చేసికొని, విదేశ మారకం సంపాదించుకొంటున్నాం. ఆ మధ్య భారత అధ్యక్షుడు శ్రీ ఫక్రుద్దీన్ అహ్మద్‌గారు హైదరాబాదు విచ్చేసినపుడు మంత్రి శ్రీ కేశవులుగారు, వీటిని చూపించగా వారు, ఎంతో సంతోషించారు. కేంద్ర సిల్కు బోర్డు, చేనేత ఖాదీ బోర్డులు కూడ గ్రామీణ పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతున్నాయి. ఆంధ్ర ప్రదేశంలో మల్బరీ సిల్కు ఉత్పత్తి హైదరాబాద్, కృష్ణ, గోదావరి జిల్లాలలో 1,000 యకరాలు మల్బరీతోటల పెంపకం క్రింద లాభం ఉందని యిదివరకే వ్రాశాను. ఇది గ్రామీణ ఆర్థికాభివృద్ధికి నాంది అనాలి.

అట్లాగే గ్రామసీమల అభ్యుదయానికి ఉన్ని పరిశ్రమ ఎంతో తోడ్పడగలదు. ఈ పరిశ్రమ వికేంద్రీకృతమైనది 100 లక్షల గొర్రెలు మన రాష్ట్రంలో ఉన్నాయి. 40 లక్షల కురుమలు యీ వృత్తిమీద ఆధారపడుతున్నారు. 50, 60 లక్షల రూపాయల విలువగల ఉన్ని తయారయినా, 10 శాతం మనం ఉపయోగిస్తున్నాం. మన కంబళ్ళకు నీలగిరి, శ్రీలంకకూడా మార్కెట్లు ఉన్నాయి. ప్రభుత్వంవారు 30 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి మహబూబ్‌నగర్‌లో ఉన్నిదారం తీసే మిల్లు పెట్టారు. దానితో మన ఉన్ని మనం ఉపయోగించవచ్చు. నాణ్యమైన కంబళ్లు కూడ

(తరువాయి 10వ పేజీలో)

# ఆంధ్ర ప్రదేశ్‌లో గిరిజనాభ్యుదయం

ఆంధ్రప్రదేశ్‌లో నివసిస్తున్న గిరిజనుల సంఖ్య దాదాపు 17 లక్షలు. ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరిగాక ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమాలవల్ల వీరి జీవితాలు నేడు కొత్త పంథాలో నడుస్తున్నాయి. తరతరాలుగా సంక్రమిస్తూ వచ్చిన పేదరికం, అజ్ఞానం, సామాజిక దురాచారాల నుండి వీరు ప్రభుత్వం చేపట్టిన కృషివల్ల బయట పడగలిగారు. మొదటి నాలుగు పంచవర్ష ప్రణాళికల కాలంలో అంటే గడచిన రెండున్నర దశాబ్దాల కాలంలో వివిధ రంగాల్లో వీరు సాధించిన ప్రగతి ప్రశంసనీయమే అయినా దానివల్ల వారి అట్టడుగుతనము రూపుమాసి వారికి మిగతా సమాజానికి మధ్య నిలచివున్న అసమానతల అగాథం పూడలేదు. ఆశించిన ఫలితాలు చేకూరకపోవడంతో కేంద్ర ప్రభుత్వం తన గిరిజనాభ్యుదయ విధానంలో ఒక సమూలమైన మార్పుని ప్రవేశ పెట్టింది. ఐదవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో గిరిజన ప్రాంతాలకై ప్రత్యేకంగా ఉప ప్రణాళికలు రూపొందించడంతో ఈ నూతన విధానం రూపుదిద్దుకొంది. ఈ నూతన విధానంలో గిరిజనాభ్యుదయానికై రాష్ట్ర స్థాయిలో ఉపప్రణాళిక జిల్లాస్థాయిలో సమీకృత గిరిజనాభివృద్ధి పథకాలు రచింపబడ్డాయి. ప్రణాళికా రచన వికేంద్రీకరణతోపాటు ప్రాదేశిక విధానం ప్రాతిపదికగా చేసుకొని కార్యాచరణ పథకాలు రూపొందించడం ఈ నూతన విధానంలోని ముఖ్యసారాంశం. సాధారణ రంగం వనరులను గిరిజనాభ్యుదయానికి అత్యధికంగా మళ్లించి మిగతా సమాజస్థాయిని అందుకొనేలా వారి ప్రగతిని శీఘ్రంగా సాధించడం ఈ నూతన విధానం ముఖ్య లక్ష్యంగా ఎంచుకొంది.

ఈ ఉప ప్రణాళికలు సమీకృత గిరిజనాభ్యుదయ పథకాలు ప్రాంతీయ ప్రణాళిక వ్యూహం ప్రాతిపదిక మీద ఆధారపడ్డవి. కాల పరిమితి గల కార్యక్రమాలు మొదట నిర్ణయించుకొన్న పద్ధతిలో కాలవ్యవధిలో ఆశించిన ఫలితాలు చేకూర్చేవి ఈ పథకాలు. ప్రతి ప్రాంతానికి ప్రత్యేకంగా అచ్చటి విశిష్ట స్థితిగతులకు అనుగుణంగా రూపొందించ బడతాయి.

ప్రతి గిరిజన ప్రాంతపు భౌగోళిక వనరులు అభివృద్ధి స్థాయి ఆయా ప్రజల అవసరాలు అభిరుచులు మొదలైన అంశాలన్నీ దృష్టిలో పెట్టుకొని వాటిని అనుసరిస్తూ ఆ ప్రాంతాభివృద్ధికై కేవలం ఆ ప్రాంతానికి పరిమితమయ్యే కార్యాచరణ పథకాలు రూపొందించి అమలు చేయబడతాయి. ఇందుకైనా సూక్ష్మస్థాయిలో పరిశీలన జరిపి జనసాంద్రత, భౌగోళిక, ఆర్థిక, సామాజిక పరిస్థితుల ఆధారంగా వివిధ అభివృద్ధి కేంద్రాలను ఎంపిక చేస్తారు. ఈ కేంద్రాలు పథకాలను రూపొందిస్తాయి. ఈ విధంగా అట్టడుగు స్థాయిలో ప్రణాళికారచన జరగడంవల్ల ఆయా ప్రాంతాల స్థితి గతులకు, అభివృద్ధికి సదవగాహన ఏర్పడి అభివృద్ధి వేగం పుంజుకునే అవకాశం కలుగుతుంది. అంతేకాక అభివృద్ధి కార్యక్రమాల్లో అచ్చటి ప్రజల అలవాట్లు, జీవన పద్ధతులు పూర్తిగా ప్రతిబింబిస్తుండటంవల్ల వారిలో అభివృద్ధి కార్యక్రమాలపట్ల సదవగాహన కుదిరి వాటిలో పాల్గొనే ఆసక్తి పెంపొందుతుంది. ఈ విధంగా తమ అభివృద్ధికార్యక్రమంలో పాల్గొనే శక్తి గిరిజనుల్లోనే పుత్పన్నమవుతుంది. ఈ కార్యక్రమాలన్నీ మొదట నిర్ణయించిన క్రమంలో మొదటవిధించిన కాలపరిధిలో ఫలితాలను చేకూరేలా రూపొందితే గిరిజన ప్రాంతాలన్నీ ఒకే అభివృద్ధి గమనంతో సమానంగా ప్రగతిని సాధించ గలుగుతాయి వారి విశిష్ట మానసిక, సాంఘిక, ఆర్థిక సంప్రదాయాలకు భంగం కలగకుండా గిరిజనుల పరిస్థితులను మెరుగు పరచాలనే సూత్రం ఈ అభివృద్ధి కార్యక్రమాలన్నిటిలో దారంలా మెలుగుతుంది.

## వ్యవసాయ రంగం

అభివృద్ధి సాధనలో గిరిజన ప్రాంతాలకి, మిగిలిన ప్రాంతాలకి మధ్య అంతరాలను తొలగించడం ఈ విధానం ముఖ్య పుద్దేశం అవడంవల్ల, గిరిజన ప్రాంతాల ఉత్పత్తి శక్తిని పెంచడం కీలకమైన అంశంగా కార్యక్రమాలను రూపొందించడం జరుగుతుంది.

—శ్రీ యం. బాపూజీ

గిరిజనులకి వ్యవసాయం అతి ప్రాధానమైన రంగం అవడంవల్ల అభివృద్ధి కార్యక్రమాల రూపకల్పనలో ఈ రంగం అతి కీలకమైన స్థానం వహిస్తోంది. ఈ వ్యవసాయరంగం గణనీయంగా అభివృద్ధి చెందేందుకు అవసరమైన బహుముఖ కార్యక్రమాలు అమలు పరుస్తారు. ముఖ్యముగా గిరిజన ప్రాంతాల్లోని వ్యవసాయ భూములకు సాగునీటి సరఫరా, వ్యవసాయానికి అవసరమయ్యే ఎరువులు, విత్తనాలు, ఆధునిక పనిముట్లు, గిరిజన రైతులకు భారీ ఎత్తున అవసరమయ్యే మార్కెటింగ్ సౌకర్యాలు కల్పించడం మొదలయినవి ఈ పథకాల్లోని ముఖ్య కార్యక్రమాలు. వ్యవసాయ రంగానికి అనుబంధాలయిన పశుగణాభివృద్ధి, వ్యవసాయ వుత్పత్తులమీద ఆధారపడ్డ పరిశ్రమలు స్థాపించడంలాంటి కార్యక్రమాలు చేపడతారు. అంతేకాక వ్యవసాయాభివృద్ధికి దోహదం చేసే అవస్థాపవసతుల (Infrastructure) అభివృద్ధికి గిరిజన ప్రాంతాల్లో విద్యుచ్ఛక్తి, రోడ్లు, రవాణా మొదలైన సౌకర్యాలను పెంచడానికి తగిన కార్యక్రమాలు రూపొందిస్తారు. దానంతటితోపాటు, గిరిజనాభివృద్ధికి తోడ్పడే అతి కీలకమయిన గిరిజనేతర వ్యాపారస్తుల దోపిడీ నివారణకి ఈ నూతన పథకాల్లో అత్యంత ప్రాముఖ్యతనిస్తున్నారు. ఇందు నిమిత్తం గిరిజన ప్రాంతాల్లో సహకారరంగం పటిష్టం చేయడానికి తలపెట్టారు. గిరిజనుల అటవి, వ్యవసాయ వుత్పత్తులకు సరియైన ధర లిచ్చే మార్కెటింగు అవసరాలను, వారికి కావలసిన పరపతి అవసరాలను తీర్చేందుకై క్రయ విక్రయ–పరపతి వ్యవస్థను ఏర్పరిచారు. ఈ వ్యవస్థ వారి మార్కెటింగు

పరపతి అవసరాలను సంఘటితంగా ఏకకాలంలో తీరుస్తుంది. గిరిజనేతరులను గిరిజనుల ఆర్థిక వ్యవస్థనుంచి పూర్తిగా తొలగించేందుకు ఈ చర్యలు తీసుకోబడ్డాయి. ఈ విధముగా వెనుకటి మందత్వాన్ని తొలగించి, గిరిజనుల బహుముఖాభివృద్ధి శీఘ్రంగా సాధించి, మిగతా సమాజానికి, వారికి మధ్యనున్న అసమానతలను సమూలంగా పెల్లగించివేసేందుకు ఈ నూతన విధానంలో అనేక కార్యక్రమాలు చేర్చారు.

## సమీకృత గిరిజనాభివృద్ధి పథకాలో

ఈ నూతన విధానం ఆంధ్రప్రదేశ్‌వారు వర్తింప చేయడం వల్ల ఈ రాష్ట్రంలోకూడ ఉప ప్రణాళికలు, సమీకృత గిరిజనాభివృద్ధి పథకాలు రూపొందించారు. ఈ ఉప ప్రణాళిక నిమిత్తం కేటాయించిన సొమ్ము 4,532.83 లక్షలు. ఇందులో 3,435 లక్షలు రాష్ట్ర నిధులనుండి, 300 లక్షల రూపాయలు కేంద్ర రంగం నిధులనుండి, మిగతా 100 లక్షల రూపాయలు ఇతర సంస్థల వనరుల నుండి చేకూర్చబడ్డాయి. అంతేకాక కేంద్ర ప్రభుత్వం మరో 700 లక్షల రూపాయల అదనపు సహాయం చేకూరుస్తోంది. రాష్ట్రంలోని షెడ్యూల్డు ప్రాంతాలున్న 7 జిల్లాలయిన శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, అదిలాబాద్ జిల్లాలోని మొత్తం 12,198.81 చ. మైళ్ళు షెడ్యూల్డు ప్రాంతాలని ఈ ఉపప్రణాళిక క్రింద చేర్చారు. ఈ ప్రాంతాల్లో నివసిస్తున్న 9,09,450 మంది గిరిజనులు ఈ ఉపప్రణాళికవల్ల లాభం పొందుతారు. ఇక పోతే సమీకృత గిరిజన అభ్యుదయ పథకాలు విశాఖ పట్టణం, ఖమ్మం, అదిలాబాదు, వరంగల్, పశ్చిమ గోదావరి జిల్లాలలో సిద్ధం చేయబడి అమలు జరుగుచున్నవి. తూర్పు గోదావరి జిల్లాకు కూడ ఈ మధ్యే తయారు అయింది. ఈ జిల్లాల్లో ఈ పథకాలను అమలు పరిచేందుకై సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థలు (ఐ. టి. డి. ఎ) ఏర్పరచబడ్డాయి. ఈ సంస్థల ఆధ్వర్యంలో ఈ పథకాల్లో గిరిజనాభివృద్ధి కార్యక్రమాలు అమలు పరచబడుతున్నవి.

ఈ సంస్థలు రాబోయే 15, 20 సంవత్సరాల్లో గిరిజన ప్రాంతాల స్వరూపాన్నే సమూలంగా మార్చుకునే విధంగా భారీ ఎత్తున కార్యక్రమాలను రూపొందిస్తున్నాయి. ఇవి ఏ ప్రాంతానికా ప్రాంతం ప్రాతిపదికగా చేసుకొని సూక్ష్మ పరిశీలనా విజ్ఞానంతో, వికాస పథకాలను రూపొందించి గిరిజనులకు ఆమోదయోగ్యం కాగల విధంగా అమలు పరుస్తున్నాయి.

ఈ విధంగానే రాష్ట్రంలోని గిరిజనుల ప్రగాఢ వికాసానికి ఇంతకుముందు కనీవినీ ఎరుగని విధంగా కృషి జరుగుతున్నది. శాస్త్రీయత, వాస్తవికతలతో రూపొందించిన ఈ నూతన విధానంలోని వివిధ కార్యక్రమాలు గిరిజన ప్రాంతాల స్వరూపాన్నే మార్చివేసే విధంగా అమలుచేయడం ఆరంభమైంది. ఈ కార్యక్రమాలపై ఇదివరకటికన్న ఎన్నోరెట్లు అధిక మొత్తం వ్యయపరుస్తున్నారు. ఈ విధంగా ఇనుమడించిన ప్రభుత్వ కృషితోపాటు గిరిజనులు కూడ తమ మనోభావాలను మార్చుకొని చైతన్యవంతులయి దీక్షతో పాటుపడితే ప్రభుత్వం చేస్తున్న కృషియొక్క ఫలితాలను అందుకొంటూ మిగతా ప్రజలతో సమానంగా పురోగమించగలరు. అప్పుడు దేశంలో అన్నిరకాల అసమానతలు, అంతరాలు తొలగిపోయి అందరం కలలు కంటున్న 'సమసమాజం' ఏర్పడగలదు.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ హైదరాబాదులోని సమాచార కేంద్రంలో కీ. శే. కందుకూరి వీరేశలింగంగారి జయంతి సందర్భంగా ఆవిష్కృతమైన ఛాయాచిత్రపటం.

నవీన దృక్పథంలో

# గ్రామీణ గ్రంథాలయం

—శ్రీ వెలగా వెంకటప్పయ్య

గ్రామీణ గ్రంథాలయాలకు తెలుగు దేశానికి సన్నిహిత సంబంధం ఉంది. ప్రజా బలమే పట్టుగొమ్మగా ఈ శతాబ్దంలో తెలుగునాట వెలసినన్ని గ్రామీణ గ్రంథాలయాలు భారతదేశంలో మరే యితర రాష్ట్రంలో లేవంటే ఆశ్చర్యం లేదు. గత నూరు సంవత్సరాలుగా అవి చేసిన కృషికి అవధులు లేవు. చేయవలసిన పనికి ఎల్లలులేవు.

తెలుగు సంస్కృతి విజయ పరంపరను సంపుటీకరించుచున్న శక్తివంతమైన సంప్రదాయ సదనం మన గ్రామీణ గ్రంథాలయం. వివేకోదయానికి పుట్టినిల్లు. వెలుగు వెన్నెలకు కాణాచి. అజ్ఞాన తిమిరానికి నభోమణి. విద్యా విజ్ఞానాలకు వారధి. మొక్కవోయిన మెదడుకు పనిగల్పించటానికి, అనుభూతులను, ఆలోచనలను వెలయేటి గంగలలుగా పరువెత్తించే చైతన్య స్రవంతి. మధురానుభూతుల, మమతల వెలలేని పాఠాలు విప్పిచెప్పే మౌన విద్యామందిరం. సంస్కృతీ సౌరభాలను దశదిశలా చిందించి, ఆలోచనలు పరవళ్ళు త్రొక్కించే దివ్య పారిజాతం. విజ్ఞాన ఫలపుష్పభరిత కల్పవృక్షం. ఇంతటి శక్తి సంపన్నమైన గ్రామీణ గ్రంథాలయానికి అనంతమైన చరిత్ర ఉంది.

పూర్వకాలంలో గ్రంథాలయాలు లేవని చెప్పలేము. ఉన్నవి. కాని వాటి ఉపయోగంపరిమితం. రాజులు, మంత్రులు జమీందారులు, మఠాధిపతులు, పీఠాధిపతులకుమాత్రం పరిమితమై ఉండేది. వారి ప్రాపకం సంపాదించినవారికి మాత్రం అందు ప్రవేశం లభించేది. పేరు అందరికోసం సార్వజనీన గ్రంథాలయాలు గత శతాబ్ది రెండో పాదంనుంచి మాత్రమే తెలుగు గడ్డమీద ప్రారంభమౌతూ వచ్చాయి. దీనికి ఆంగ్ల విద్యాభ్యాసం వలన యువజనులలో వచ్చిన చైతన్యం స్వాతంత్రేచ్ఛ, వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమం, గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యవహారిక భాషోద్యమం, జాతీయోద్యమం-తెలుగు తీరంలో గ్రంథాలయోద్యమం ఉవ్వెత్తుగా వ్యాపించడానికి తోడ్పడ్డాయి. మేధాశక్తిని పెంపొందించి, మానవ వ్యక్తిత్వానికి సుస్థిరతను కల్పించే బలమైన ఉద్దేశం ఈ గ్రంథాలయాల ధ్యేయం కావడంచేత ఈ శతాబ్ది ప్రారంభంనాటికి యివి రెండు వందలదాకా పెరిగాయి.

ఈ సానుకూల వాతావరణంలో గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు, సూరి వెంకట నరసింహ శాస్త్రిగారు, మరికొందరు నిష్కామసేవకులైన యువకులు ఉద్యమంలో ప్రవేశించి, తమ యావచ్ఛక్తిని ప్రజాజీవితానికే అంకితం చేసి ఉద్యమానికి జవజీవాలు కల్పించారు. గ్రామీణ గ్రంథాలయాలను మోసులెత్తిన విజ్ఞాన స్రవంతిగా తీర్చిదిద్దారు. వయోజన విద్యా కేంద్రాలుగా రూపొందించారు. చదువురాని వారికి సైతం పత్రికలు చదివి వినిపించి వారిలో జాతీయ భావాలు పాదుకొల్పారు. నిసర్గంగా, అనాదృతంగా పల్లెసీమలలోగల జానపద కళలకు కాణాచిగా వెలయించారు. ముఖ్యంగా జాతీయోద్యమ దినాలలో వివిధ ప్రజోద్యమాలను కార్యకర్తలను తయారుచేయడంలో, వివిధ ప్రజోపయోగ కార్యక్రమాలు నిర్వహించడంలో పల్లెపట్టుల గ్రంథాలయాలు గురుతరమైన బాధ్యతను నిర్వహించాయి. కనుకనే ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఆంధ్రదేశంలోని ప్రతి గ్రామ గ్రంథాలయ అధ్యక్షుని గ్రామరాజ్యపు మునసబుగానూ, కార్యదర్శిని కరణంగానూ చిత్రించడంలో ఎంతో వాస్తవం కనిపిస్తుంది.

చిరకాల వాంఛితమైన స్వాతంత్ర్యం సిద్ధించాక గ్రంథాలయ చట్టం ఏర్పడింది. గ్రంథాలయ వ్యవస్థలో మౌలికమైన మార్పులు వచ్చాయి. వివిధ యాజమాన్యాలలో జరుగుతున్న గ్రంథాలయ సేవను క్రోడీకరించి సర్వ సమగ్రమైన గ్రంథాలయ విధానానికి పునాదులు వేయబడ్డాయి.

జిల్లా స్థాయిలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి జిల్లా గ్రంథాలయ సంస్థలు ఏర్పడ్డాయి. వీటి పరంగా ఐదువేల జనాభాకు పైబడిన గ్రామాలలో పుస్తక పంపిణీ కేంద్రాలు, ఆర్థిక వనరులు ఉన్నంతవరకు స్థాపించుకునే అవకాశం కలిగింది. దీనితో బాటు ప్రయివేటు గ్రంథాలయాలను సముచిత రీతిలో ఆదుకొనే అవకాశం చట్టంలో కల్పించబడింది. ఈ విధంగా ఏర్పరచిన గ్రంథాలయాల జాతీయావసరాలకు తోడ్పడే విధంగా పుస్తకాలు, పత్రికలు దృశ్య శ్రవ్య పరికరాల ద్వారా నవభారత పౌరులలో నూతన దృక్పథంలో విజ్ఞాన వ్యాప్తి కలిగించవలసిఉంది.

మనది ప్రజాస్వామిక దేశం. ప్రజాస్వామిక విధానం నాలుగు కాలాల పాటు సురక్షితంగా పరిరక్షింపబడాలంటే ప్రజలంతా విద్యావంతులు కావాలి. నిర్బంధ ప్రాథమిక విద్యా విధానం ప్రవేశపెట్టడం ద్వారా పిల్లలలో నూటికి నూరు మంది విద్యావంతులయ్యే అవకాశం ఉంది. అయితే పెద్దలలో అవిద్యా శాతం పెరిగిపోతూ ఉంది. దీనిని అచిర కాలంలో అరికట్టడానికి ప్రభుత్వం, వారిని విద్యావంతులుగా చేయడానికి తోడుగా ప్రతి గ్రామీణ గ్రంథాలయం వయోజన విద్యా కేంద్రం కావాలి. వయోజనులకు, కొత్తగా చదువు నేర్చిన వారికి వినియోగించే పుస్తకాలను పత్రికలను సేకరించాలి.

మనది ముఖ్యంగా వ్యవసాయక దేశం పాడిపంటలకు నిలయమైన పుణ్యభూమి. ఈ నవీన అవకాశాలకు తగినట్లు గ్రంథాలయం



కొత్త గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీకి బేగం పేట విమానాశ్రయంలో స్వాగతం




దుస్తులు తయారు చేసేవారు, విక్రయించేవారి ఫెడరేషన్ కార్యవర్గాన్ని ఉద్దేశించి కార్మిక శాఖా మాత్యులు శ్రీ టి. అంజయ్య గాంధీజ్ఞాన మందిర్‌లో ప్రసంగిస్తున్న దృశ్యం. చేనేత శాఖా మంత్రి శ్రీ కె. వి. కేశవులు కూడా చిత్రంలో వున్నారు.

## నగరంలో వార్తా చిత్రాలు




"యాజమాన్యంలో కార్మికుల భాగస్వామ్యం"పై ఏప్రిల్ 22నుండి 24 వరకు జూబిలీ హాలులో జరిగిన సెమినారులో మాజీ గవర్నరు శ్రీ బి.జె. దివాన్ ఉపన్యసించారు.




1977 ఖరీఫ్ కాన్ఫరెన్సు ఏప్రిల్ 30, మే 1 తేదీల్లో జూబిలీ హాలులో జరిగింది. వ్యవసాయ శాఖమంత్రి శ్రీ జె. చొక్కారావు ప్రారంభించారు.



సికిందరాబాద్ రైల్వే స్టేషన్లో పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ వారి పార్లర్‌ను శ్రీ కె.ఎస్. రాజన్ ఏప్రిల్ 24న ప్రారంభించారు.



న్యూ ఎం.ఎల్.ఏ. వసతి గృహంలో ఏప్రిల్ 29న పి.డబ్ల్యు.డి. శాఖా మాత్యులు శ్రీ సి.హెచ్. వెంకటరావు సౌకర్యాల సంఘం సమావేశానికి అధ్యక్షత వహించారు.





ఆర్థిక శాఖ కార్యదర్శి బి.పి.ఆర్. విఠల్, ఐ.ఏ.ఎస్, జిల్లా ప్లానింగ్ కాన్ఫరెన్సును ప్రారంభోత్సవం చేశారు.

నాంపల్లి ప్రభుత్వ ఆసుపత్రిలో మే 1 న డాక్టర్ బంకట్‌చంద్రగారు హజ్రత్ యూసఫ్ షరీఫ్ బాబా స్మారక వార్డుకు ప్రారంభోత్సవం చేశారు.

మే 2న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఏకాడమీ తరఫున బహుముఖ పండితుడు, మాజీ సెషన్స్ జడ్జి శ్రీ గుండేరావు హర్కారేగారికి రూ. 1116 బహూకరించారు.



## 11

తెల్లవారింది. లోక బాంధవుడు తన లేత బంగరు కిరణాలతో ప్రపంచానికి కొత్త రంగులు పులుముతున్నాడు. రాత్రి తెల్లవార్లూ ఆవరించిన తమస్సుపటా పంచలై పోయింది.

ప్రకాశం ఉదయాన్నే లేచి స్నానాదికాలు ముగించుకొని, చేతితోవడికి నేసిన ధోవతి, లాల్చీ ధరించి చౌదరిగారి ఇంటి వైపు బయలుదేరాడు. ప్రకాశంఅన్నా, రామదాసుఅన్నా హరిజనవాడలోని వాళ్ళకేగాక ఊళ్లో వాళ్ళకిగూడ ఒక విధమైన గౌరవ భావంవున్నది.

బి. ఏ. దాకా ప్రభుత్వం వారు కల్పించిన సదుపాయాలతోనే చదివాడు ప్రకాశం బి. ఏ. తప్పాక తరువాత ప్రకాశంలో చాల మార్పు వచ్చింది. అంతవరకు పెద్ద చదువులు చదివి అన్నలాగే పెద్ద ఉద్యోగం చేయాలని కలలుకన్న ప్రకాశం, ఇప్పుడు ఉద్యోగం చేయనని భీష్మించుకున్నాడు. ఈ చదువుతో నైనా చౌదరిగారి సహాయంతో ఉద్యోగం సంపాదించ వచ్చును గాని, అసలు ఉద్యోగం చేయటమే ఇష్టం లేనప్పుడు ఎవరేంచేయగలుగుతారు?

వినోబాజీ భూదాన ఉద్యమ సందర్భంగా రామాపురం విచ్చేసినప్పుడు చౌదరి తన పొలంలో కాస్త పర్రభూమి చూసి అయిదెకరాలు రామదాసుకు దానం ఇచ్చాడు. అయితే నేమి ప్రకాశం తన చెమటోడ్చి ఆ చవిటినేలను ఈ నాడు సారవంతమైనదిగా మార్చాడు.

ఆ అయిదెకరాలు సేద్యం చేసి స్వతంత్రంగా జీవించటానికే నిశ్చయించుకున్నాడు ప్రకాశం.

తను స్కూల్‌లోను, కాలేజీలోను చదువుకున్న దానికంటే ఎంతో ఎక్కువ లోకంలో నేర్చుకున్నాడు ప్రకాశం.

నిజానికి కాలేజీలలో చెప్పే పాఠాలు జీవితానికి పనికిరావు. మనిషికి కావలసిన మనోవికాసాన్ని అవి కలిగించటం లేదు.

అందు చేతనే కాలేజీ మానివేసినా ప్రకాశం చదువు మాత్రం మాన లేదు. వీరేశలింగంగారి పుస్తకాలూ, గురజాడ, చిలకమర్తి, పానుగంటి వారి రచనలు ప్రకాశాన్ని నిజంగా ప్రకాశింప చేశాయి. ఉన్నవ వారి మాల పల్లి, అతణ్ణి మరో మెట్టు పైకి ఎక్కేలా చేసింది. మహాత్ముని ఆత్మకథ ప్రకాశానికి బహిః ప్రాణం. మరి వాటిని స్కూళ్ళలోనూ, కాలేజీలలోను ఎందుకు చదివించరో అర్థం కాలేదు ప్రకాశానికి.

మానసిక వికాసానికి తోడ్పడేవే నిజమైన రచనలు గదా!

ఈ కారణం చేతనే ప్రకాశం లక్ష్మికి కోరినప్పుడల్లా అటువంటి పుస్తకాలు అందించాడు. అసలైన జ్ఞానం ఏమిటో తెలిసేట్టు చేయగలిగాడు. అనేక విషయాల మీద లక్ష్మితో చర్చలు సాగించేవాడు. తెలియని విషయాలను తెలిసికోవటానికి ప్రయత్నం చేసేవాడు.

లక్ష్మి అంటే ప్రకాశానికి ఒక విధమైన గౌరవ భావం వున్నది. ఆమె తన యజమాని కూతురు అయినందువల్ల కలిగిన భావం కాదు అది.

లక్ష్మిని గురించి ఆలోచిస్తూ వుంటే ప్రకాశం ఈ లోకాన్నే మరిచిపోతాడు. లక్ష్మి మనోవికాసం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. చదివింది హైస్కూలు వరకే అయినా ఈనాడు లక్ష్మి ఏ పట్టభద్రుకి కూడా తీసిపోదు!

లక్ష్మి సుగుణాలరాశి. అందాల భరిణ. లక్ష్మిని వివాహం చేసికొనే అదృష్టవంతుడు ఎవరో!

ప్రకాశానికి తను లక్ష్మిని ప్రేమిస్తున్నానా అనే ఆలోచన వచ్చింది క్షణకాలంపాటు. ఆ ఆలోచన రాగానే మేను పులకరించింది. లక్ష్మిలో ఏదో ఆకర్షణ శక్తి వున్నది. లేకపోతే తన మనస్సు చకోరంవలె ఆ చంద్ర బింబాన్ని చూడటానికి ఎందుకు తహతహ లాడుతుంది!

అయితే మరి లక్ష్మి సంగతో! లక్ష్మి కూడ నన్ను చూడటానికి ఇలాగే ఎదురు చూస్తుంటుందా! ప్రేమకు భాష వుండదా? ప్రేమ భాష మూగభాష. ఆ భాష ప్రేమించిన హృదయాలకే తెలుస్తుందిగాని మరొకరికి అర్థం కాదు! ప్రేమించిన హృదయాలు ఆకాశంలో ఆనందంగా విహరిస్తాయి. వాటికి కష్టాలు కష్టాలుగా అనిపించవు. కంటకములు కూడ కుసుమాలవలె కోమలంగాను సుగంధయుక్తముగాను భాసిస్తాయి!

ప్రకాశం ఊహాలోకాలనించి భూమి మీదకి దిగివచ్చాడు. తనకు సమాజంలో గల స్థానం గుర్తుకు వచ్చింది. ఈ సమాజ వ్యవస్థలో తాము భార్యా భర్తలు కాలేరు! లక్ష్మిని తను ప్రేమించే అధికారం, అంతస్థు కూడ తనకు లేదు! తను కేవలం ఆ దేవిని ఆరాధించవలసినవాడే. లక్ష్మి గుడిలోని దేవత. కేవలం దూరం నుంచి ప్రణామం చేయవలసినవాడే తను. అందని ఆకాశకుసుమం లక్ష్మి.

ఈ సమాజ వ్యవస్థ మీద కోపం వచ్చింది ప్రకాశానికి. పూర్వం ఇన్ని భేదాలు వుండేవికావు. వర్ణవ్యవస్థ ఈ విధంగా వుండేదికాదు! కాని నేడు వైజ్ఞానికంగా ఎంతో ముందుకు పోయిన ఈ శతాబ్దిలో కూడ మన సమాజం మారలేదు కుల వ్యవస్థ బలపడుతున్నది కాని నిర్మూలన మవటం లేదు! గాంధీ మహాత్ముని కృషి పూర్తిగా ఫలించలేదు. సమాజంలో భిన్న వర్గాల ప్రజల మధ్య వైషమ్యాలు పెరుగుతున్నాయే కాని తగ్గటం లేదు. స్వార్థం, సంకుచితత్వం సమాజాన్ని జలగలా పట్టి పీడుస్తున్నాయి! ఇవి మారేది ఎన్నటికో! యువతీ-యువకులే దీనికి పూనుకోవాలి! వారే నాయకత్వం వహించాలి!

ఆలోచిస్తూ తెలియకుండానే చౌదరిగారి ఇంటికి వెళ్ళాడు ప్రకాశం!

చౌదరి అప్పుడే తన గదిలో కూర్చొని కాఫీ తాగుతున్నాడు.

చౌదరిగారు కనిపించితే ముందు ఆయన దగ్గరకు వెళ్ళి పాదాభివందనం చేయటం ప్రకాశానికి అలవాటు. తన కుటుంబం ఈనాడు ఈ స్థితిలో వున్నదంటే అందుకు కారణం చౌదరిగారి

చలువే చౌదరిచేసే కొన్ని పనులు ప్రకాశానికి నచ్చకపోయినా ఆయన పై గౌరవం మాత్రం తగ్గలేదు

ప్రకాశం వెళ్ళి చౌదరికి పాదాభివందనం చేశాడు ! ఎప్పటి లాగా 'హల్లోవోయి ప్రకాశం' అని చౌదరి అనలేదు !

ప్రకాశం చౌదరి కళ్ళలోకి చూశాడు। ఆయన కళ్ళు చింత నిప్పులలా ఎర్రగా వున్నాయి।

హైద్రాబాదు రాజధాని అయినప్పటి నుండి చౌదరికి మద్యపానం అలవాటయిందని ప్రకాశానికి తెలుసు. ఇంకా నిషా తగ్గలేదేమో అనుకున్నాడు ప్రకాశం.

'లక్ష్మి ఏంచేస్తున్నదండి!, అని అడిగాడు ఈ ప్రశ్న కొత్తది కాదు చౌదరికి. ఎన్నోసార్లు ఈ ప్రశ్నకు సమాధానమిచ్చాడు ఆయనే స్వయంగా।

కాని అదే ప్రశ్న ఈనాడు ఆయనలో క్రోధాగ్నిని ప్రేరేపించింది। అగ్ని పర్వతం బ్రద్దలయింది।।। ఆయనలో దాగివున్న దానవుడు వికృత రూపంతో వికటాట్టహాసం చేశాడు.

“లక్ష్మి ఏంచేస్తున్నదా? ఏంచేస్తే నీకెందుకు? నీకోసం విరహగీతాలు పాడుతున్నది। వెధవ।। చెప్పులు కుట్టుకొని బ్రతకాల్సిన వాడివి, నాకూతుర్ని ప్రేమిస్తావా? నీ అంతస్థేమిటి? నా అంతస్థేమిటి? అశుద్ధం తిని బ్రతికే పందివి నాఇంట్లో జొరబడతావా”?

ప్రకాశం నిర్ఘాంతపోయాడు అనుకోకుండా ఎదురయిన ఈ అగ్నివర్షానికి। అసలు ఏం జరిగిందో అర్థంకాలేదు.

తమాయించుకొని 'బాబుగారూ। మీరేదో పొరబడ్డట్టున్నారు. అసలు సంగతేమిటో చెప్పండి....'అన్నాడు.

“ఇంకా నీకు సంగతి విపులంగా చెప్పాలా? నా నోటితోనే చెప్పిస్తావుటరా ద్రోహీ। ఛీ। నీ ముఖంచూస్తే పాపం। కుక్కకు కూడ విశ్వాసం వుంటుందిగాని నీకు లేదురా. థూ” అంటూ ఆక్రోశం పట్టలేక సగం త్రాగిన కాఫీని ప్రకాశం మొహంమీద పడేలా విసిరాడు.

“నాకేం తెలియటంలేదు బాబుగారు। నేను నిర్దోషిని, నన్ను నమ్మండి।” అని ప్రకాశం మొరపెట్టుకుంటున్నకొద్దీ చౌదరీ మరీ రెచ్చిపోయాడు.

లేచి ప్రకాశాన్ని జుట్టుపట్టుకొని ఆచెంపా, ఈచెంపా తన శక్తికొద్దీ వాయించి వాయించి అలసిపోయి రొప్పుతూ నిలబడ్డాడు.

ప్రకాశానికి చెంపలు వాచిపోయాయి. చేతులతో చెంపలు తడుముకున్నాడు. కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయి.

అనుకోకుండా ఎదురయిన అవమానం భరించలేకపోయాడు, ఎంతో నిగ్రహాన్ని ప్రదర్శించాడు ప్రకాశం.

“బాబుగారూ। నేను తలచుకుంటే మీమీద చేయి చేసుకోగల శక్తి శారీరకంగా నాకు వుంది. కాని ఈ శరీరం మీ ఉప్పుతిని పెరిగింది బాబుగారూ. అందుచేతనే మీకు ఎదురు తిరగలేకపోయింది. నేను తప్పుపని ఏదైనా చేస్తే దండిచే అధికారం మీకు ఎప్పుడూ ఉంటుంది బాబుగారూ. కాని విషయమేమిటో తెలిసికోకుండా నన్ను దండించారనే నాబాధ...।।। మీరేదో పొరబడ్డారని నా నమ్మకం...”అంటూ పుట్టెడు అవమాన భారంతోనూ, దుఃఖంతోనూ, దీనంగా తిరిగి వెళ్ళిపోయాడు ప్రకాశం.

## 12

ప్రకాశం వచ్చి వెళ్ళాడనీ, బాబుగారు ఎందుకో ప్రకాశాన్ని కోప్పడటమేకాకుండా, కొట్టి పంపించారని అప్పలమ్మద్వారా లక్ష్మికి తెలిసింది.

లక్ష్మికి కారణం తెలిసికోవటానికి ఎక్కువసేపు పట్టలేదు. తండ్రికి ప్రకాశంమీద కోపం రావటానికి తనే కారణం.

తనవల్ల పెద్ద పొరపాటు జరిగిపోయింది. కనీసం తను ప్రకాశాన్ని ప్రేమిస్తున్నట్టు ప్రకాశానికి కూడా చెప్పలేదు। ప్రకాశం అభిప్రాయమేమిటో తెలిసికొనే ప్రయత్నం కూడా చేయలేదు। ఏక పక్షంగానే తన ప్రేమను వెల్లడించింది. తన మూలంగా ఏమీ తెలియని ప్రకాశం అవమానం పాలయ్యాడు. ఇంటికి వచ్చిన మనషికి తన తండ్రి చేసిన మర్యాద ఇదేనా?

ఆ రోజల్లా ఏమీ తోచలేదు లక్ష్మికి. తండ్రీ — కూతుళ్ళు ఇద్దరు ఒకరితో ఒకరు మాటాడుకోలేదు.

తండ్రి విషయంలో లక్ష్మి పొరపాటు పడింది. తండ్రి తన కోరికను గురించి ఆలోచిస్తాడని అనుకుంది. కాని ఇలా జరుగుతుందని కలలో కూడా అనుకోలేదు.

ఇంతకూ ప్రకాశం తనను ప్రేమించాడో లేదో తెలియదు కదా। ఒక వేళ ప్రేమించినా లోకంగురించి బాగా తెలిసినవాడవడం చేత తమ వివాహం అసంభవ మంటాడేమో?

ముందుగా ప్రకాశం అభిప్రాయం తెలిసికోకుండా తండ్రితో ప్రస్తావించటం చాలా పొరపాటయి పోయింది, తనుచేసిన నేరానికి మరొకవ్యక్తి బాధపడటం, అవమానం పాలు కావలసి రావటం సంభవించింది।

ప్రకాశంగురించి లక్ష్మికి బాగా తెలుసు. అతని ఆశయాలూ, భావాలూ సుపరిచితమే. తను వాటితో పూర్తిగా ఏకీభవిస్తుంది. కాని ఇది వివాహానికి సంబంధించిన విషయంగదా. ఇది వ్యక్తిగత విషయం. ఇందుకు ఇద్దరి అభిప్రాయాలూ తెలుసుకోవాలిగదా।

తన తొందరపాటుకు ఎన్నిసార్లు తనను తాను నిందించుకున్నదో లక్ష్మి। ఎప్పుడూ నవ్వుతూ ఇతరులను నవ్విస్తూ వుండే

ప్రకాశం ముఖం ఆ అవమానంతో ఎంత మలినమైపోయిందో ! ఊహించుకోవటానికే భయంవేసింది లక్ష్మికి.

తండ్రిసంగతి తనకు తెలుసు: ఆయన పట్టుదలగల మనిషి. ఇక ఆయనను ప్రాధేయపడటం అర్థంలేని పని. ఇక్కడే వుంటే తండ్రి తన అభిప్రాయంతో నిమిత్తం లేకుండానే వివాహంచేయచ్చు. ఆ వరంగల్లు సంబంధమో, మరొకటో స్థిరపరచక మానడు.

తండ్రికి తనమీద ఎంత మమకారం వున్నా ఈ విషయంలో పట్టు విడుస్తాడని నమ్మకంలేదు :

లక్ష్మి మనస్సు పరివరివిధాల పరుగెత్తసాగింది. ప్రకాశాన్ని తన తప్పు క్షమించమని ప్రార్థిస్తే క్షమిస్తాడా? ఏమో: క్షమిస్తాడని నమ్మకమేమిటి: 'డబ్బున్న వాళ్ళందరూ ఒకే రకం మనుషులు' అని ఈసడించుకొంటాడేమో? ఇంత అవమానం పాలయ్యాక తిరిగి తన ఇంటికి వస్తాడా? మునుపటిలాగా తనతో నవ్వుతూ మాటాడుతాడా: వచ్చినా తనముఖం చూపించగలదా?

ప్రకాశం గురించి ఆలోచిస్తున్నకొద్దీ గతం లక్ష్మి కళ్ళముందు మెదలసాగింది.

అప్పుడు తనకు ఏడెనిమిది ఏళ్ల వుంటాయేమో: ఆ ఏడాదే తండ్రి పది ఎకరాల మామిడితోట కొన్నాడు.

తను 'మామిడితోట చూస్తాను నాన్నా' అని అడిగింది తండ్రిని.

తండ్రి 'సరే' నని తీసికొనివెళ్ళాడు.

అప్పటికే దాసు అక్కడపని చేస్తున్నాడు. దాసుతోపాటు ప్రకాశంకూడా పారతో మట్టి తీసి నీరు పారేందుకు కాలువలు చేస్తున్నాడు.

తను ప్రకాశం దగ్గరే నిలబడి కాలువలు చేస్తూవుంటే చూస్తూవుండిపోయింది.

దాసు తండ్రిని తీసికొని తోటంతా తిప్పి చూపిస్తున్నాడు. ఏ చెట్టుకాయలు ఎటువంటివో, ఏ రకానికి చెందినవో ఎన్నికాయలు కాస్తుందో, ఎంత ఆదాయం వస్తుందో విపులీకరిస్తున్నాడు.

ప్రకాశం కాలువలు చేస్తున్న తావుకు దగ్గరలోనే పెద్ద మోటబావి వున్నది. చాల పెద్దబావి. నీళ్ల కూడా చాలా లోతుగా వున్నాయి. తను బావి చూడటానికి వెళ్ళింది. గట్టున నిలబడి చూస్తూవుంటే ప్రకాశం హెచ్చరిస్తూనే వున్నాడు 'అమ్మాయిగారూ దూరంగా నిలబడి చూడండి. కళ్లు తిరుగుతాయి!' అని.

అప్పటికే తను బావి అంచున నిలబడి చూస్తున్నది: మోటబావి కావటంతో బావిచుట్టూ పిట్టగోడ లేదు. తనకు కళ్ళు తిరిగాయి: తమాయించుకొని వెనక్కి అడుగు వేద్దామని అనుకున్నది కాని: కాలు వెనక్కి రాలేదు: ఫలితంగా జారి బావిలో పడిపోయింది.

ప్రకాశం వంద గజాల దూరంలో కాలువలు బాగు చేస్తూనే వున్నాడు. గట్టుమీద తను కనబడకపోయేసరికి జరిగింది అర్థం చేసుకున్నాడు. పరుగున వచ్చి కేకలు వేస్తూ గభీలున బావిలోకి దూకాడు.

ఆ తరువాత ఏం జరిగిందో తనకు సరిగా తెలియదు: ప్రకాశం కేకలకు దాసు, తన తండ్రీ పరుగున వచ్చారు.

అప్పటికే ప్రకాశం తనను పట్టుకొని బయటకు లాగాడు. కాని పైన ఆధారం దొరక్కపోయేసరికి ఇద్దరూ మునిగారు. ఇది చూసిన దాసు, చౌదరి మోటతాడు వూడదీసి మోటబొక్కెన బావిలోకి జారవిడిచారు:

ఈసారి తేలేసరికి బొక్కెన చేతికి అందింది ప్రకాశానికి. ఒక చేత్తో బొక్కెన అందుకొని రెండోచేత్తో తనను అతి కష్టంమీద బొక్కెనలో కూర్చోబెట్టాడు. అప్పటికే ప్రకాశం బాగా అలసిపోయాడు. ఎలాగో తనుకూడ బొక్కెనలో దూరాడు.

దాసు-తన తండ్రి కలిసి బొక్కెన పైకి లాగి ఇద్దరికీ ప్రథమ చికిత్సచేశారు. అప్పటికే తను నీళ్ళు తాగింది.

ఊళ్లో ఇంగ్లీషు డాక్టరులేడు. వెంకటాచారే వైద్యం చేస్తూవుంటాడు.

దాసు ప్రకాశాన్ని ఇంటికి తీసికొనిపోతానన్నాడు. కాని తన తండ్రి బలవంతపెట్టి ప్రకాశానికి కూడా తనతోపాటే వైద్యం చేయించాడు. తన ఇంట్లోనే: మర్నాడు గుంటూరు నుంచి ఇంగ్లీషు డాక్టరు వచ్చి పరీక్షచేసి ఫరవాలేదన్నాడు.

అప్పటినుంచీ ప్రకాశం అంటే తనకు అభిమానం. ప్రకాశానికి గూడ తనంటే ఎంతో ఇష్టం.

తన తండ్రే అన్నాడు ప్రకాశంతో ఎన్నోసార్లు స్వయంగా "ప్రకాశం: నీవు నిజంగా ప్రకాశానివిరా ! మా ఇంటికి వెలుగు నిచ్చావురా: చిన్నవాడివి. నీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియటంలేదు'' అని.

అటువంటి ప్రకాశాన్ని ఈనాడు తండ్రి అవమానపరచాడు. ఈ విధంగా ఋణం తీర్చుకున్నాడు !

ఇందులో తండ్రిదే పూర్తి దోషంకాదు. తనే దోషి. తన మూలంగానే నిరపరాధికి శిక్షపడింది. ఈ పాపానికి నిష్కృతి ఏమిటి?

ఆలోచిస్తూ వుండిపోయింది లక్ష్మి.

( సశేషం )

# వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు

—శ్రీ కడియాల అమరసుందర్

ఆంధ్ర ప్రదేశ్ లక్ష అరువేల చదరపు మైళ్ల వైశాల్యంతో దేశంలో ఐదో పెద్ద రాష్ట్రంగా విలసిల్లుతోంది. నాలుగున్నర కోట్ల జనాభాతో నాల్గవ స్థానాన్ని కల్గివుంది.

మన రాష్ట్రంలో నూటికి 80 మంది పల్లెపట్టులలో నివసిస్తున్నారు. అందులో నూటికి 70 మంది వ్యవసాయం మీద ఆధారపడి జీవనయాత్ర కొనసాగిస్తున్నారు. మన రాష్ట్రానికి వచ్చే మొత్తం ఆదాయంలో 59% అనగా 1974-75వ సంవత్సరం లెక్కల ప్రకారం ఒక్క వ్యవసాయ రంగానికి వచ్చిన ఆదాయం 4,119 కోట్ల రూపాయలు. దీనిని బట్టి మన రాష్ట్రంలో వ్యవసాయానికి ఉన్న ప్రాధాన్యత అవగతమవుతుంది. అంతేకాదు. వ్యవసాయం మీద ఆధారపడిన పరిశ్రమల ఆవశ్యకత ఎంతో ఉన్నదని స్పష్టమవుతోంది.

మన రాష్ట్రంలో మొత్తం 124 లక్షల హెక్టార్ల భూమి సాగులో ఉండగా అందులో 91 లక్షల హెక్టార్ల భూమిలో ఆహార పదార్థాలను పండిస్తున్నారు. అందులో ఒక వరి పంట పండించే విస్తీర్ణమే 78 లక్షల హెక్టార్ల దాకా ఉంటుంది. తక్కిన పైర్లలో ప్రధానంగా పేర్కొనవలసినవి వేరుశనగ, ఆముదం, చెరకు, పత్తి, మొక్కజొన్న, పొగాకు, మిర్చి మొదలయినవి.

వ్యవసాయ ప్రధానమయిన మన రాష్ట్రం ఇప్పుడిప్పుడే పారిశ్రామిక రంగంలో కూడా గణనీయమయిన ప్రగతిని సాధిస్తున్నది. ఈ రంగంలో మరింత అభివృద్ధిని సాధించడానికి కావలసిన వనరులు మనకు పుష్కలంగా ఉన్నాయి.

మన రాష్ట్రంలో ఇప్పటికి 240 భారీ, మధ్యతరహా పరిశ్రమలు నెలకొని ఉన్నాయి. అంతేకాక 16,072 చిన్నతరహా పరిశ్రమలు కూడ ఉన్నాయి. యివి కాక మరి ఇంకెన్నో క్రొత్త పరిశ్రమలకు లైసెన్సులు యివ్వడం జరిగింది. వాటిలో కొన్ని వివిధ స్థాయిలలో నిర్మాణంలో ఉన్నాయి. ఐతే వీటిలో వ్యవసాయ సంబంధ పరిశ్రమల సంఖ్య హెచ్చు.

మన పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలు చాలావరకు వ్యవసాయ ఉత్పత్తుల పైననే ఆధారపడవలసివుంది. వ్యవసాయ ఉత్పత్తులు సక్రమంగా ఉన్న సంవత్సరం మన పారిశ్రామికోత్పత్తి అధికతరం కావడం, వ్యవసాయ ఉత్పత్తులు కుంటుపడిన సంవత్సరం పారిశ్రామికోత్పత్తి కూడా కుంటుపడటం మనం చూస్తూనే ఉన్నాం. దీనిని బట్టి వ్యవసాయానికి, పరిశ్రమలకు గల అవినాభావ సంబంధం వ్యక్తమవుతుంది.

ఆంధ్ర ప్రదేశ్ లాంటి వ్యవసాయక రాష్ట్రంలో ఖనిజ, లోహ, రసాయనిక, ఇంజనీరింగ్ సంబంధమయిన పరిశ్రమలతో పాటు వ్యవసాయ పరిశ్రమల స్థాపన ఎంతో ముఖ్యం. వ్యవసాయ సంబంధ పరిశ్రమలు రెండురకాలు. ధాన్యం, వేరుశనగ, మొక్కజొన్న, చెరకు, పుగాకు, పత్తి మొదలయిన వ్యవసాయోత్పత్తుల ఆధారంతో నడిచే పరిశ్రమలు ఒకరకం కాగా, వ్యవసాయానికి కావలసిన ఎరువులు, క్రిమిసంహారక ఔషధాలు తయారుచేసే పరిశ్రమలు రెండవరకం.

## నిరుద్యోగ నివారణ

మన దేశంలో నిరుద్యోగ నివారణకు యితోధికంగా వ్యవసాయ సంబంధ పరిశ్రమల స్థాపన ఎంతో అవసరం. ముఖ్యంగా భారతదేశం లాంటి వర్ధమాన దేశాలలో వ్యవసాయ పరిశ్రమలు గ్రామీణ ప్రజల జీవనస్థాయిని పెంపొందించడంలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తాయి. గ్రామీణ ప్రజానీకంలో అత్యధిక భాగం సంవత్సరంలో అత్యధిక కాలం పనిపాటలు లేక వ్యర్థజీవనాన్ని గడుపుతూ ఉంటారు. పని దొరికిన కొద్దిమందికి పనికి తగ్గ వేతనం లభించదు. ఈ దుస్థితి తొలగాలంటే వ్యవసాయ పరిశ్రమల స్థాపనే శరణ్యం.

వ్యవసాయ పరిశ్రమలు నిరాఘాటంగా కొనసాగడానికి యితోధికమయిన వ్యవసాయోత్పత్తులు ఎంతో అవసరం. అందుకు ముఖ్యంగా నీటిపారుదల సౌకర్యం ప్రాణప్రదమైనట్టిది. గోదావరి, కృష్ణ, తుంగభద్ర మొదలయిన జీవనదులతో తొణికిసలాడుతున్న మన రాష్ట్రం నీటిపారుదల రంగంలో ముందంజ వేసింది. మొత్తం మన రాష్ట్రంలో సాగువుతున్న భూమిలో 38 శాతం నీటిపారుదల సౌకర్యం ఉంది. ఇప్పుడు నిర్మాణంలో ఉన్న నాగార్జునసాగర్, పోచంపాడు వగైరా ప్రాజెక్టుల నిర్మాణం పూర్తికావడంతోను, భూగర్భ జలసంపదను మరింతగా వెలికితీయడంతోను మన రాష్ట్రంలో నీటిపారుదల సౌకర్యం 50 శాతానికి పెరుగుతుంది. అంటే పంటలు సమృద్ధిగా పండుతాయన్నమాట. అంతేకాదు, మరిన్ని వ్యవసాయ పరిశ్రమల స్థాపనకు అవకాశం ఏర్పడుతుంది.

ఏ పరిశ్రమ స్థాపించడానికైనా విద్యుచ్ఛక్తి చాలా అవసరం. విద్యుచ్ఛక్తి రంగంలో మన రాష్ట్రం నిన్న మొన్నటి వరకు వెనుకబడి వున్నమాట వాస్తవం. కాని ఈనాడు మన అవసరాలకు సరిపడే విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకోగలుగుతున్నాం. మన రాష్ట్రం శీఘ్రగతిని పారిశ్రామిక ప్రగతిని సాధించడానికి యిది ఒక శుభ సూచన.

మన రాష్ట్రంలో ఉన్న వ్యవసాయ సంబంధమయిన పరిశ్రమలలో అత్యధిక భాగం అనగా ఆహారపదార్థాల ఉత్పత్తికి సంబంధించిన బియ్యం మిల్లులు, చమురు గింజల నుండి నూనె తయారు చేసే కర్మాగారాలు మొత్తం 4,636 ఉన్నాయి. ఇవి గాక 21 పంచదార ఫ్యాక్టరీలు, 153 ఖండసారి మిల్లులు, 197 బట్టల మిల్లులు, 399 పుగాకు అనుబంధ పరిశ్రమలు, నాలుగు

జనపనార కర్మాగారాలు ఉన్నాయి. మన రాష్ట్రంలో బియ్యపు మిల్లులను ఆధునికీకరణ చేయవలసిన అవసరం ఎంతోవుంది. మన రాష్ట్రంలో పంచదార పరిశ్రమ ప్రముఖమయిన పరిశ్రమగా పేర్కొనవచ్చు. ఇప్పుడు ఉన్న 21 పంచదార ఫ్యాక్టరీలు కాకుండా మరో 19 ఫ్యాక్టరీలకుగాను లైసెన్సులు జారీచేయడం జరిగింది. ఈ ఫ్యాక్టరీల నిర్మాణంతో మన రాష్ట్ర ఆర్థిక స్తోమతు పెరగడమే కాకుండా వీటి అనుబంధ పరిశ్రమలయిన డిస్టిలరీలు, రసాయనిక పరిశ్రమలు, కాగితం, అట్టలు తయారుచేసే కర్మాగారాలు ప్రవర్ధమానమవడానికి దోహదం చేస్తాయి.

మన రాష్ట్రంలో లభ్యమయ్యే వివిధ రకాల విత్తనాల నుండి చమురును, పిండిని తయారుచేసే పరిశ్రమలు యితోధికంగా యిటీవల స్థాపించడం జరిగింది. ఇవి మన ఆహార పదార్థాలకు అవసరమైన నూనెలను సరఫరా చేయడమే కాకుండా సబ్బులు, రంగులు వగయిరా పరిశ్రమలకు కావలసిన చమురును తయారు చేస్తాయి. రోజుకు 100 నుండి 150 టన్నుల స్థాపకశక్తి కలిగిన యిలాంటి కర్మాగారాలు మొత్తం మన రాష్ట్రంలో 25 వరకు ఉన్నాయి.

తవుడు, వేపగింజలు, పొగాకు, విత్తనాలు, ప్రత్తిగింజలు, మామిడి టెంకలు మొదలయిన వాటినుండి చమురు తీసే కర్మాగారాలు ఎక్కువగా స్థాపించబడుతున్నాయి. వీటి నుండి లభ్యమయిన చమురు వివిధ పరిశ్రమలకు ఉపయోగపడటమే కాకుండా వాటి నుండి లభ్యమయ్యే పిండి పశువులకు ఆహారంగా వినియోగపడుతుంది.

## చమురు కర్మాగారాలు

కరీంనగర్ జిల్లాలో తవుడు నుంచి చమురు తీసే కర్మాగారం ఒక కోటి పదిహేను లక్షల రూపాయల వ్యయంతో నెలకొల్పబడుతుంది. మన రాష్ట్రంలో చమురు కర్మాగారాలు స్థాపించడానికి ఎన్నో అవకాశాలున్నాయి. చమురుగింజల ఉత్పత్తిలో మన రాష్ట్రంలో రాయలసీమ అగ్రస్థానంలో ఉన్నది. కాగా పరిశ్రమలకు పనికివచ్చే చమురు విత్తనాల ఉత్పత్తిలో నల్లగొండ, మహబూబ్‌నగర్ ప్రాంతాలు ప్రసిద్ధికెక్కాయి.

మన దేశంలో ఉత్పత్తి అయ్యే వర్జీనియా పొగాకులో అత్యధిక భాగం ఆంధ్రప్రదేశ్‌లో లభ్యమవుతుంది. ఐతే మన రాష్ట్రంలో తగినన్ని సిగరెట్ ఫ్యాక్టరీలు లేక వర్జీనియా పొగాకును యితర దేశాలకు ఎగుమతి చేయడం జరుగుతోంది.

నాగార్జునసాగర్ నిర్మాణంలో నీటిపారుదల భూములలో ప్రత్తిని పండించే భూమి విస్తీర్ణం గణనీయంగా పెరిగింది. ఇప్పుడు రాష్ట్రంలో దాదాపు నాలుగున్నర లక్షల హెక్టార్ల భూమిలో ప్రత్తిని పండిస్తున్నారు. ఐతే మన రాష్ట్రంలో ఈ ఉత్పత్తికి తగినవిధంగా జౌళిమిల్లులుగాని, ప్రత్తి కొనుగోలు కేంద్రాలుగాని లేక, యితర రాష్ట్రాలకు ప్రత్తిని పంపవలసివస్తోంది.

మన రాష్ట్రంలో మొక్కజొన్న ముఖ్యంగా కరీంనగర్, వరంగల్, నిజామాబాద్ ప్రాంతాలలో పుష్కలంగా పండుతుంది. 1.5 కోట్ల రూపాయల వ్యయంతో కరీంనగర్‌లో మొక్కజొన్న గంజి కర్మాగారాన్ని నెలకొల్పుతున్నారు. మొక్కజొన్న నుండి పిండి, రవ్వ, చమురు, గూకోజ్ మొదలయిన పదార్థాలను తయారుచేసే కర్మాగారాన్ని నిజామాబాదులో నెలకొల్పడానికి సన్నాహాలు చేస్తున్నారు.

మన దేశంలో పండే మొత్తం ఆముదం పంటలో 60వ శాతం నల్లగొండ, మహబూబ్‌నగర్ ప్రాంతాలలో లభ్యమవుతుంది. 5 కోట్ల రూపాయలతో నల్లగొండలో ఒక పెద్ద ఆముదం అనుబంధ కర్మాగారాన్ని నెలకొల్పుతున్నారు.

అలాగే కోళ్ళ పరిశ్రమలో మన రాష్ట్రానిది అగ్రస్థానం. కరీంనగర్‌లో 1.17 కోట్ల రూపాయలతో కోడిగ్రుడ్ల పొడి కర్మాగారాన్ని స్థాపిస్తున్నారు. అలాగే బార్లీ నుండి గంజి తయారుచేసే కర్మాగారం తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురంలో త్వరలో పని ప్రారంభిస్తుంది. ప్రత్తి గింజల నుండి నూనె తీసే పరిశ్రమ చీరాలలో ఈ సంవత్సరం వెలుస్తుంది. ఉల్లిపాయలతో వివిధ రకాల ఉత్పత్తులు చేసే కర్మాగారం కాకినాడలో స్థాపించడం జరిగింది. ఈ ఉత్పత్తులు విదేశాలకు ఎగుమతి చేసే నిమిత్తం ఉద్దేశించబడ్డాయి. కర్నూలులో కోటి రూపాయల ఖర్చుతో పోషకపదార్థాల పరిశ్రమ త్వరలోనే పని ప్రారంభిస్తుంది. పండ్ల రసాలు, టమాటో గుజ్జుతో తయారయ్యే ఉత్పత్తుల పరిశ్రమ, చిత్తూరు జిల్లాలోని మదనపల్లిలో నెలకొల్పుతున్నారు. ఇక్కడ తయారయ్యే పదార్థాలను విదేశాలకు ఎగుమతి చేస్తారు. మన రాష్ట్రంలో విరివిగా లభ్యమయ్యే సుగంధ ద్రవ్యాలు, పరిమళ ద్రవ్యాలతో పరిశ్రమలు స్థాపించే అవకాశాలు ఉన్నాయి.

సుప్రసిద్ధమైన మామిడి పళ్ళకు మన రాష్ట్రానిది పెట్టింది పేరు. 30 కోట్ల రూపాయల వ్యయంతో హంగరీ సహాయంతో విజయవాడలో భారీ మామిడిపండ్ల అనుబంధ పరిశ్రమను నెలకొల్పడానికి నిశ్చయించారు. ఇందులో తయారయ్యే మామిడి పండ్ల ముక్కలు, రసాలు, నూనె రష్యా, పశ్చిమాసియా దేశాలకు ఎగుమతి చేయడం జరుగుతుంది.

అధిక పంటలు పండించడంలో దిట్టమయిన వాడుగా తెలుగు రైతు పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నాడు. అలాగే ఎరువుల వాడకంలో దక్షిణ భారతదేశంలో తెలుగు రైతుకు ఎవరూ సాటి లేరు. ఐతే మన రాష్ట్రంలో ఉన్న ఎరువుల కర్మాగారం ఒకే ఒకటి విశాఖపట్నంలో ఉంది. రామగుండంలోని ఎరువుల కర్మాగారం మరో సంవత్సరానికి గాని పని ప్రారంభించదు. ఇకపోతే కాకినాడలో నెలకొల్ప సంకల్పించిన ఎరువుల కర్మాగారం పని ఎప్పుడు ప్రారంభమవుతుందో యింకా నిర్దిష్టంగా తెలియదు. మన రాష్ట్రంలో ఎరువుల వాడకం దృష్ట్యామరిన్ని ఎరువుల కర్మాగారాలు స్థాపించవలసిన అగత్యం ఉంది. అలాగే మన రాష్ట్రంలో క్రిమి సంహారక ఔషధుల కర్మాగారాలు దాదాపు శూన్యమనే చెప్పాలి.

మన రాష్ట్రంలో వరిగడ్డి విస్తారంగా లభ్యమవుతుంది. దానితో కాగితం, అట్టలు తయారుచేసే పరిశ్రమలు నెలకొల్పడానికి మంచి అవకాశాలున్నాయి.

పాడి పరిశ్రమలో మనం చెప్పుకోదగ్గ అభివృద్ధిని సాధించినా యింకా ఎక్కువ పరిశ్రమలు ముఖ్యంగా పాలపొడి కర్మాగారాలు స్థాపించవచ్చు.

## గ్రామీణులకు ఉపాధి

వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు వెలసిన ప్రాంతాలలో ముఖ్యంగా గ్రామీణ ప్రజల ఆర్థిక స్తోమతు బాగా పెరిగింది. గ్రామీణులలో ఉపాధి అవకాశాలు మెరుగు అయ్యాయి. అంతే కాదు, వారికి పనికి తగ్గ వేతనం లభిస్తోంది. వ్యవసాయ పరిశ్రమలు యితోధిక స్థాపన వలననే పంజాబ్‌వంటి రాష్ట్రాలు యిటు వ్యవసాయరంగంలోనూ అటు పారిశ్రామిక రంగంలోనూ శీఘ్రమయిన ప్రగతిని సాధించడం జరిగింది. వ్యవసాయోత్పత్తులు లభించే ప్రాంతాలలో ఈ పరిశ్రమలు పెట్టడం వలన వెనకబడిన ప్రాంతాలు అభివృద్ధి చెందడం, అక్కడి ప్రజల జీవనస్థాయి పెంపొందడం జరుగుతుంది. అంతేకాదు, తక్కువ పెట్టుబడితో ఎక్కువ పరిశ్రమలను నెలకొల్పడం, అంతకన్నా మించి పెక్కుమంది నిరుద్యోగులకు ఉపాధి లభించడం— ఈ వ్యవసాయ పరిశ్రమల ప్రధానమైన లక్ష్యం. అంతేకాదు, మన జాతీయాదాయం చెప్పుకోదగ్గంతగా పెరగడానికి ఈ పరిశ్రమలు జీవగర్రల వంటివి.

మన వ్యవసాయరంగంలో విప్లవాన్ని సాధించే రబ్బర్ టైర్ల ఎడ్లబండిని యిటీవల మన రాష్ట్ర అగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్ రూపొందించింది. మూడున్నర టన్నుల బరువును జత ఎడ్లు సునాయాసంగా లాగగల ఈ బళ్ళకు ముఖ్యంగా నిజామాబాదు, ఉయ్యూరు చక్కెర ఫ్యాక్టరీ ప్రాంతాలలో మంచి గిరాకీ ఉంది. విజయవాడలో రబ్బర్ టైర్ల బళ్ళ కార్ఖానా పెట్టాలనే యోచన కూడా ఉంది.

నాగార్జునసాగర్, పోచంపాడు మొదలయిన ప్రాజెక్టుల నిర్మాణంలో లక్షలాది హెక్టార్ల భూమికి నీటిపారుదల సౌకర్యం ఏర్పడుతుంది. వివిధ రాష్ట్రాల మధ్య కృష్ణా, గోదావరి నదీ జలాల వినియోగంపై ఒప్పందం అమలు జరగడంతో మన రాష్ట్రంలో మరిన్ని ప్రాజెక్టులు రావడమే కాకుండా మరికొన్ని లక్షల హెక్టార్ల భూమికి నీటిపారుదల సౌకర్యం ఏర్పడుతుంది.

మన రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న పటుతరమయిన కృషి ఫలితంగా రాష్ట్రంలో పారిశ్రామిక వాతావరణం నెలకొంటున్నది. యిందుకు తగ్గట్టు ఇప్పుడిప్పుడే మన రాష్ట్రంలో పరిశ్రమల స్థాపనకు పారిశ్రామిక వేత్తలు ముందుకు వస్తున్నారు.

దక్షిణ భారతదేశంలో ధాన్యాగారంగా ప్రసిద్ధికెక్కిన ఆంధ్ర ప్రదేశ్ యావద్భారత దేశ ధాన్యాగారంగా భాసిల్లే రోజు దగ్గర్లోనే ఉంది. అదేవిధంగా మన రాష్ట్రం పారిశ్రామిక రంగంలో కూడా అమోఘమయిన ప్రగతిని సాధిస్తుందనడంలో ఎట్టి సందేహం లేదు. ఇందుకు వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు ఎంతో అవసరం. (ఆకాశవాణి సౌజన్యంతో)

---

## ఈ సంచికలో రచయితలు

### శ్రీయుతులు


శ్రీమతి అడవి కొలను పార్వతి, గాంధీనగర్, కాకినాడ-4.
డాక్టర్ ఆర్. వి. రావు, 3-4-674/1 నారాయణగూడా, హైదరాబాద్.
ఎం. బాపూజి, డిపార్టుమెంట్ ఆఫ్ పొలిటిక్స్ అండ్ పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్, ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం.
వెలగా వెంకటప్పయ్య, జిల్లాకేంద్ర గ్రంథాలయం, కడప-516001.
ఉన్నవ మదనమోహనరావు, 6-3-354/2, హిందీనగర్ కాలనీ, బంజారాహిల్స్, హైదరాబాద్.
కె. అమరసుందర్, కేరాఫ్ డెక్కన్ క్రానికల్ సికిందరాబాద్.
తిరుమలరామచంద్ర, 69, ఆదర్శనగర్, హైదరాబాద్.
ముద్దసాని రాంరెడ్డి, జర్నలిష్టు, పూటూరు (వయా) వీణవంక, కరీంనగర్ జిల్లా.
కె. లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శ నగర్, హైదరాబాద్.
జె. ఎస్. రామకృష్ణ, నిడుమోలు, దివి తాలూకా, కృష్ణాజిల్లా-521156.
టి. వేణుగోపాల్, టి.పి.ఆర్.ఓ., రాయపూరు.
కుమారి జి. కళ్యాణగుణవతీదేవి, కొట్ల మాదప్ప వీధి, విజయనగరం-2 విశాఖపట్నం జిల్లా.
శ్రీమతి సి. ఆనందారామం, ఎస్.టి. 26, మారేడుపల్లి, సికింద్రాబాద్.
కె. రామచంద్రరావు, పి.జె. 49, పంజాగుట్ట, హైదరాబాద్.
పి. సాంబశివరావు, 17 వ లైను, అరండల్ పేట, గుంటూరు-2.
శ్రీమతి బి. స్వర్ణాంబ, 130. ఆర్. ఎస్. వీధి, తిరుపతి.
దాశరథి, 13-సి, ఫిల్మ్ డైరెక్టర్స్ కాలనీ, మద్రాసు-600024.
అద్దేపల్లి రామమోహనరావు, 52-4-4, చిక్కాలవారి వీధి, జగన్నాథ పురం, కాకినాడ, తూర్పు గోదావరిజిల్లా.

# రాజధాని విశేషాలు

## డాక్టర్ సి. నారాయణరెడ్డికి సన్మానం :

ప్రఖ్యాత కవి, విమర్శకుడు, చలనచిత్ర గేయ రచయిత డాక్టర్ సి. నారాయణరెడ్డిని "పద్మశ్రీ" బిరుదు పొందిన సందర్భంగా జంటనగరాలలోని 40 సాంస్కృతిక సంస్థలు మార్చి 2వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో ఘనంగా సన్మానించారు. సన్మానసభకు రాష్ట్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించారు. తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ముఖ్య అతిథిగా వున్నారు. డాక్టర్ సి నారాయణరెడ్డికి తెలుగువారి హృదయాలలో సన్మాన్యమయిన స్థానం ఇదివరకేవుందని, దానికి ప్రభుత్వ పరిగణన పద్మశ్రీ బిరుదు ప్రధానమని శ్రీ సాంబశివరావు అన్నారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన నారాయణరెడ్డికి ప్రభుత్వం పద్మశ్రీ కన్నా గొప్ప బిరుదు ఇవ్వవలసిందని శ్రీ రామానుజరావు అన్నారు. డాక్టర్ నారాయణరెడ్డి రచించిన సరిక్రొత్త కావ్యం "ఇంటి పేరు చైతన్యం"ను డాక్టర్ బిరుదు రాజు రామరాజు ఆవిష్కరించారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని శుభాకాంక్షలు తెలిపారు. డాక్టర్ బోయి భీమన్న, డాక్టర్ ముకురాల రామారెడ్డి, శ్రీ వెంకటశివయ్య శ్రీ జె. బాపురెడ్డి, నారాయణరెడ్డి రచనలలోని విశిష్టతను తెలిపారు. డాక్టర్ నారాయణరెడ్డి కృతజ్ఞత తెలుపుతూ, బిరుదులతో పరువు, పరువుతోబాటు బరువు పెరుగుతుందని కవికి నిరంతర గమనమే గమ్యమని అన్నారు. ఈ సన్మాన సభను "రసమయి" సంస ఏర్పాటు చేసింది. ప్రారంభంలో ప్రఖ్యాత నర్తకి శ్రీమతి సుమతీ కౌశల్ స్వాగతం పలికారు.

## విద్యార్థినులకు గవర్నర్ సలహా :

రాష్ట్ర తాత్కాలిక గవర్నర్ శ్రీ బి జె. దివాన్ మార్చి 11న మహబూబియ బాలికల జూనియర్ కళాశాలలో ప్రసంగిస్తూ, విద్యార్థినుల, విద్యావంతులయిన స్త్రీలు రాష్ట్రంలోని మహిళలలో నిరక్షరాస్యతను, వెనుకబడినతనాన్ని తొలగించడానికి ముందుకు రావాలన్నారు. వీరు నిరక్షరాస్యలైన మహిళలను అక్షరాస్యులుగా చేసే బాధ్యత స్వీకరించినప్పుడే, స్త్రీలు పురుషులతో సమానంగా అభివృద్ధి చెందడానికి అవకాశం వుంటుందన్నారు. దేశంలో మహిళల జనాభా 48 శాతం వున్నా చదువుకున్నవారు ఐదు శాతం మాత్రమే వున్నారని గవర్నర్ వివరించారు. రాష్ట్ర హోంశాఖ కార్యదర్శి శ్రీ యం. వి. నారాయణరావు సభకు అధ్యక్షత వహించారు. గవర్నర్ సతీమణి శ్రీమతి నందినీ దివాన్ బహుమతులు పంచిపెట్టారు. ప్రారంభంలో కళాశాల ప్రిన్సిపాల్ స్వాగతం చెప్పారు.

## ఉగాది సాంస్కృతికోత్సవాలు :

మార్చి 20వ తేదీ ఉదయం మహబూబ్ కాలేజీ ఆవరణలో కవిసమ్మేళనంతో ప్రారంభమై మూడు రోజులపాటు జరిగిన పింగళ ఉగాది సాంస్కృతికోత్సవాలు జంటనగరాల ప్రజలను విశేషంగా ఆకర్షించాయి. ఉత్సవాలను మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు ప్రారంభిస్తూ పింగళ ఉగాది తెలుగువారి జీవితాలలో నవోదయం ప్రసాదించాలని కోరారు. కవిసమ్మేళనానికి అధ్యక్షత వహించిన తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు "కవివైతాళికుడు ప్రజలలో జాగృతి కలిగించడంలో అగ్రగామిగా వుండాలి. తన రచనలతో కొత్త భావాలను ఆశలను చిగురింపజేయాలి" అన్నారు. కవి సమ్మేళనంలో పాల్గొన్నవారు చాలావరకు సమకాలిక సమస్యలను వస్తువుగా గ్రహించారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, డాక్టర్ దాశరథి కృష్ణమాచార్య, కేశవపంతుల నరసింహశాస్త్రి, బోయి భీమన్న, ముదిగొండ వీరభద్రమూర్తి, మాల కొండయ్య, ఉత్పల సత్యనారాయణాచార్యులు, కుందుర్తి ఆంజనేయులు, కుమారి వాసిరెడ్డి సీతాదేవి, జె. బాపురెడ్డి, డాక్టర్ ఆరిపిరాల విశ్వం, శ్రీమతి ఎం. లక్ష్మీ సాగర్, పోతుకూచి సాంబశివరావు, కోకా రాఘవరావు, పాలగుమ్మి విశ్వనాథం, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీమతి శారదా అశోకవర్ధన్ పాల్గొన్నారు. ఈ సందర్భంలోనే "బాల" పిల్లల మాసపత్రిక ఆవిష్కరణోత్సవం జరిగింది. ఉగాది ఉత్సవాలకు సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు శ్రీ వై. వి గోపాలస్వామి అధ్యక్షత వహించారు. హిందూ పత్రిక సాంస్కృతిక ప్రతినిధి శ్రీ శ్రీహరి ప్రారంభించిన సాంస్కృతిక పక్షపత్రిక "పల్లవి"ని విద్యాశాఖామంత్రి శ్రీ మండలి ఆవిష్కరించారు. పత్రిక మొదటి ప్రతి స్వీకరించిన పోస్టల్ డైరెక్టర్ దక్షిణ భారతంలో ఇలాంటి పత్రికలు అవసరమన్నారు. వివిధ భాషలకు, సంస్కృతులకు ఆటపట్టయిన జంటనగరాలలో ఈ పత్రిక పరస్పరావగాహనను పెంపొందించగలదని ఆయన అన్నారు. సాంస్కృతిక కార్యక్రమాలలో కుమారి ఎల్. విజయలక్ష్మి కూచిపూడి నృత్యం, శ్రీ మండలి వెంకటకృష్ణారావు కుమార్తె చిరంజీవి రేవతి రామ పట్టాభిషేక నృత్యం, కురుక్షేత్ర నాటకం ప్రేక్షకులను బాగా ఆకట్టుకొన్నాయి. కురుక్షేత్ర నాటకంలో శ్రీయుతులు పీసపాటి, ఎ. వి. సుబ్బారావు (కృష్ణ), టి శేషారావు (భీమ), బి. వి సుబ్బారావు (ధర్మజ), బ్రహ్మయ్య అప్పారావు (అర్జున), నగరాజకుమారి (ద్రౌపది) తదితరులు పాల్గొన్నారు.

— శ్రీ తిరుమల రామచంద్ర



యాక్టింగ్ గవర్నరు శ్రీ బి. జె. దివాన్ ఏప్రిల్ 14వ తేదీన బాబాసాహెబ్ అంబేద్కర్ 86వ జయంత్యుత్సవాలు ప్రారంభిస్తున్న దృశ్యం



సోవియట్ రష్యానుండి నేత్రవైద్య నిపుణుల బృందం ఏప్రిల్ 18న హైదరాబాదు వచ్చింది. ప్రొఫెసర్ ఫియోదోసా కంటి శస్త్ర చికిత్స కూడా నిర్వహించారు.

# నగరంలో వార్తాచిత్రాలు



శ్రీ బి. జె. దివాన్ ఏప్రిల్ 18న అబుల్ కలామ్ అజాద్ పరిశోధనా సంస్థ ఆవరణలో మోతీలాల్ నెహ్రూ స్మారక ఉపన్యాసం చేశారు. సాంఘిక సంస్కరణలకు ముందు స్థితిగతుల గూర్చి ఆయన ప్రసంగించారు.



లఘుపరిశ్రమల శాఖామాత్యులు శ్రీ వై. నారాయణస్వామి ఏప్రిల్ 13న అబుల్ కలామ్ అజాద్ పరిశోధనాసంస్థ ఆవరణలో "దక్షిణ భారత లఘుపరిశ్రమల అస్థిత్వం'' సెమినార్ ప్రారంభించారు

# ప్రజాబంధు శ్రీ రాజాబహద్దర్

జననం : 22-8-1869 మరణం : 2-5-1953

శ్రీ రాజబహద్దర్ వెంకట్రామరెడ్డి గారు నాటి అవిభక్త హైదరాబాద్ రాష్ట్రంలో ప్రభుసేవకు, ప్రజాసేవకు పెట్టిందిపేరు. నిజాము నవాబు రాష్ట్రంలో యాభైమూడు వసంతాలు ప్రభుసేవ చేస్తూ, ప్రజాసేవకు త్రికరణశుద్ధిగా అంకితమైన నిష్కళంక ప్రజాసేవకుడు కొత్వాల్ వెంకట్రామారెడ్డిగారు. నాటి హైదరాబాదు రాష్ట్రంలో అత్యున్నత పదవి నధిష్టించిన హైందవులలో రెడ్డిగారు ప్రథములు, అంతటి ఉన్నత పదవిని చేపట్టినా, అత్యంత నిరాడంబరంగా, నిస్వార్ధ సేవచేసిన మహామనీషి శ్రీ వెంకట్రామ రెడ్డి. మహబూబ్‌నగరం జిల్లా మారుమూల గ్రామంలో రైతు కుటుంబంలో 1869, ఆగష్టు 22వ తేదీన రెడ్డిగారు జన్మించారు. చిన్ననాడే కన్నవారిని కోల్పోవడంచేత, మేనమామగారైన శ్రీ విలియం వాహబ్‌గారి ప్రాపకంలో పెరిగి విద్యాబుద్ధులు నేర్చారు. విలియం వాహబ్‌గారు వనపర్తిరాజాగారి మేనల్లుడు. వనపర్తి రాజాగారు కుల మత వర్గ తత్వాల కతీతుడు. వారి మేనల్లునికి ముస్లిం, ఆంగ్ల సంస్కృతులను ప్రతిబింబించే "విలియం వాహబ్"గా నామకరణం చేశారు. విలియం ఆంగ్లనామం. వాహబ్ ఉర్దూపేరు. ముస్లిమ్, ఆంగ్లేయ సంప్రదాయాలకు తన మేనల్లుడి పేరు ప్రతీకగా ఉండాలని వనపర్తిరాజా సంకల్పము. అలాంటి లౌకిక దృక్పథంగల కుటుంబంలో పెరిగినవాడు కనుకనే వెంకట్రామారెడ్డి పరమత సహనం వెన్నతోపెట్టిన విద్య అయింది. రెడ్డిగారికి 18 సంవత్సరములు నిండీనిండక ముందే ఆయన మేనమామ పరమపదించారు. దిక్కులేని రెడ్డిగారికి దేవుడేదిక్కు అన్నట్లు, ఒక ముస్లిం పోలీస్ ఇన్స్‌పెక్టర్, రెడ్డిగారిని తనవెంట తీసుకొనివెళ్ళి పోలీసు అమీన్ పదవిని ఇప్పించాడు. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి, ఎవరి ఆదరణ వల్లనో ఉద్యోగం పొందిన రెడ్డిగారికి చిన్ననాడే జీవిత పరమార్ధం అవగతమై పోయింది. విద్యలు, గద్దెలు, హోదాలు, సన్మానాలు, అన్నీ నశ్వరమైనవనీ, చిరస్థాయిగా ఉండేది కీర్తికాయమేనని రెడ్డిగారు ఏనాడో గుర్తించడంవల్ల ప్రజాసేవకు తన జీవితాన్ని త్రికరణశుద్ధిగా అంకితం చేశారు. అంచేత తనవారికి, తన ప్రజానీకానికి శాశ్వతంగా నిలిచియుండే సేవ చేయాలని సంకల్పించుకొన్నాడు. పదవిని, పలుకుబడిని అందుకు ఆలంబనంగా తీసుకుని ప్రజాసేవ చేయడానికి బద్ధకంకణుడైయ్యాడు. అందరి తలలో నాల్కగా మసలాలని ఆశించాడు, ఆరాటపడ్డాడు. దివారాత్రములు కష్టించి, నిష్కళంకమగు ప్రభుసేవతో పైకివచ్చాడు. చదువుకన్నా సంస్కారబలం, ఆడంబరాలకన్నా అనుభవబలం బలీయంగా ఉండడంవల్ల, అందరి మెప్పును పడసి కొత్వాల్ పదవినధిష్టించాడు. రెడ్డిగారు తన అరువదవయేట వేల్సు యువరాజు రాకను పురస్కరించుకొని ఆంగ్లమునభ్యసించి, బ్రిటిష్ యువరాజుతో ముచ్చటించి, భళీయనిపించుకొన్న దిట్ట శ్రీ వెంకట్రామారెడ్డి.

## ప్రతిభాశాలి

ఆయన ప్రతిభకు రెండు ధారలు. ఒకటి ప్రభువుకు అర్పితము, రెండవది ప్రజలకు అంకితము. రెడ్డిగారు నిజాం నవాబుగారి తలలో నాలుక, ప్రజావళికి పట్టుగొడుగు. తనవద్ద ఉన్నది అణగద్రొక్కే అధికారం, తన చుట్టూ ఉన్నది అణగి మణగి ఉన్న మూగప్రజ. అధికారాన్ని దుర్వినియోగం చేయకూడదు. తనవారి ఆశయాలను నలగనీయకూడదు. "కన్నూ తనదే-వ్రేలూ తనదే" ఇలాంటి విషమ స్థితిలో దక్షుడైన మధ్యస్థుడుగా వ్యవహరించి, అందరి మన్ననలకు పాత్రుడైన ప్రజ్ఞాశాలి శ్రీ రెడ్డి. ఇట్టి ద్విపాత్రాభినయంతో నటసామ్రాట్టయి నాటి రాజకీయ నాటకాన్ని రక్తి కట్టించగలిగారు. భారతదేశంలో స్వాతంత్ర్యసమరం ఉవ్వెత్తుగా సాగుతున్న రోజులవి, సంస్థానాల ప్రాకారాలు ఎంత ఎత్తుగా ఉన్నా. స్వాతంత్ర్య సమర వీచికలు నలుదెసలా బాహాటంగా వీచసాగినవి. ప్రజానీ జాగృతం కావడానికి విద్యాబలం ఎంతో

శ్రీ ముద్దసాని రాంరెడ్డి

అవసరం. అందుకే రెడ్డిగారు గ్రంథాలయోద్యమానికి, హరిజనోద్ధరణకు, వితంతు వివాహాలకు, బాల్య వివాహ నిషేధానికి అండగా నిలిచారు. సంఘ సంస్కరణోద్యమాలు సమాజంలో విద్యావికాసం లేనిదే సాధ్యంకాదు. కాబట్టి రెడ్డిగారు మొదట హైదరాబాదు రాష్ట్రంలో విద్యావ్యాప్తికి కృషిచేశారు. నిజాం నవాబు హయాంలో అక్షరాస్యుల సంఖ్య మూడు శాతం మాత్రమే ఉండేది. విద్యాభ్యాసానికి ఆరాటపడేవారు నాడు హైద్రాబాదు రావాల్సి ఉండేది. హైద్రాబాదు వచ్చే యువకులకు నిలువ నీడ కూడ ఉండేది కాదు. నాటి యువకుల యాతనను గుర్తించిన కొత్వాల్‌గారు విద్యార్థుల కొరకు వసతి గృహాన్ని నిర్మించ సంకల్పించారు. వారి ఆశయాలకు ఆచరణ రూపం ఇవ్వడానికా అన్నట్లు అప్పట్లో వనపర్తి రాజా గారి కూతురు వివాహం నిశ్చయమైంది. వివాహ మహోత్సవంలో ఎందరో సంస్థానాధీశులు, జమీందార్లు, దేశముఖులు పాల్గొన్నారు. కొత్వాల్ గారు కూడా వెళ్ళి, పెండ్లి పెద్దల సమక్షంలో తమ ఆశయాన్ని అభివ్యక్తం చేశారు. మొదట పింగిలి వెంకట రామారెడ్డి గారు పదివేలు విరాళం చదివించారు. వారితో పాటు వనపర్తి రాజాగారు 25 వేలు. గద్వాల రాజాగారు 30 వేలు విరాళం ఇచ్చారు. మిగిలిన పెద్దలు కూడ యధాశక్తి విరాళాన్ని ప్రకటించారు నాడు. సేకరించిన డబ్బుతో కొత్వాల్ గారు 1918 సం॥ లో హాస్టల్‌ను 43 విద్యార్థులతో ప్రారంభించారు. నాడు 43 బోర్డర్లతో ప్రారంభించ



శ్రీమతి తిరుమల శెట్టి సీతామహాలక్ష్మమ్మ మహిళా మండలి భవనానికి 1976 అక్టోబరు 2న విద్యామంత్రి సతీమణి శ్రీమతి ప్రభావతి కృష్ణారావు ప్రారంభోత్సవం చేశారు. చిత్రంలో పి.సి.సి. అధ్యక్షులు శ్రీ తాడేపల్లి మునలయ్య, విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు, భవనదాత శ్రీ టి. కుమారస్వామినాయుడు ఉన్నారు.



అవనిగడలో మహిళా మండలి భవనం.





అవనిగడ్డ గాంధీక్షేత్రంలో అనాథ శరణాలయం.



అనాథ శరణాలయ భవనానికి విద్యార్థినుల శ్రమదానం. ఇప్పుడు యిందులోని పిల్లలకు ఉచిత భోజన, వసతి సౌకర్యాలున్నాయి.

# మహాభారతము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

"పూర్వ కాలము నందు ప్రపంచ సృష్టి చేయునప్పుడు బ్రహ్మదేవుడు, కర్మలు చేయుటలోను, చేయకుండుటలోను, పుణ్య పాపములను పొందుటలోను ఇంద్రునకు, ఇట్లు చెప్పెను:-ప్రపంచము నందు ధర్మము-అధర్మము అను ద్వంద్వమును బాగుగా గుర్తించి కర్మలు చేయ వలెను. ఎందుకనగా, మంచినీతితో చేసిన పనికి సత్ఫలమును పొంది స్వర్గమునకు, దుర్గతితో చేసిన కర్మకు దుష్ఫలము పొంది నరకమునకు పోయెదరు. వారివారి కర్మలను అనుసరించియే, ఫలములు లభించును మానవులు మోహపరవశులై సుకృతమునో దుష్కృతమునో ఆచరించి మరణించిన తరువాత పశ్చాత్తాప పడుచుందురు. ఇట్లు బ్రహ్మదేవుడు మంచి మాటలు చెప్పి యింద్రుని పంపెను. ఇందుడు గూడ ఆదేవుని సెలవుగైకొని పోయి దేవరాజ్యమును పాలించెను. కనుక విరాట రాజా! బ్రహ్మ దేవుడు చెప్పిన విధమున నీవు గూడ కర్తవ్యా కర్తవ్యములను స్థిర చిత్తముతో ననుష్ఠించుము" అని వైశంపాయనుడు చెప్పిన తరువాత వృత్తాంతమును జనమేజయునకు ఇట్లు చెప్పదొడగెను:-

"జనమేజయా! ఇట్లు ద్రౌపది దుఃఖించుచుండగా, విరాట రాజు, బలగర్వితుడైన కీచకుని అక్కడ దండించుటకు సామర్థ్యము లేనివాడై, యతనని శాంతవచనములతోనే వారించెను. కీచకుని అపరాధమునకు తగిన దండము విధించకున్న విరాటునిచూచి వ్యవహార ధర్మములను తెలిసిన ద్రౌపది, ఉత్తమ ధర్మమును స్మరించుకొనుచు విరాటరాజ సభలో నున్నవారిని చూచుచు దుఃఖితురాలై రాజుతో నిట్లనెను :-

"ఏనా పతులు శత్రువులను ఓడించి యైదు దేశములకు ఆవల పారద్రోలగా, వారు ఆరవ దేశమునందు ఉండియు నా పతుల వలన భయముచేత నిద్ర పోకుండా ఉండెదరో, ఇతరులకు దానము చేయుదురుగాని, ఇతరులను ఏదియు యాచించరో, ఎవరు బ్రహ్మజ్ఞులో, సత్యవాదులో, ఎవరి ధనుష్టంకారధ్వని దుందుభి ధ్వనివలె గంభీరముగా నుండునో, ఎవరు పరాక్రమవంతులో, జితేంద్రియులో, బలవంతులో, ఆత్మాభిమానము గలవారో, ఎవరు ఈ సమస్త లోకమును వధింపగలవారై యుండియు యిప్పుడు ధర్మ పాశముచేత కట్టబడి యున్నారో, ఎవరు శరణార్థులైన ప్రసన్నులకు శరణము నీయగలవారయ్యు లోకమునందు ప్రచ్ఛన్నముగా తిరుగుచున్నారో, మహారథికులైన ఆ నా పతులు ఇప్పుడెక్కడ నున్నారు? నా పతులు బలవంతులయ్యు, అమిత పరాక్రమవంతులయ్యు కీచకునిచేత అవమాన పరచబడుచున్న తమ ప్రియ సతిని చూచుచు నపుంసకులవలె ఎట్లు ఓర్చుకొని యున్నారు? నా పతుల కోపము, పరాక్రమము, వీర్యము ఎక్కడ పోయెను? దురాత్ముడు కొట్టు చున్న రక్షింపజాలకున్నారే! నిరపరాధురాలనైన నన్ను ఒక దుష్టుడు తన యెదుట కొట్టుచున్నను చూచుచు సహించుచున్న యీ విరాటరాజే ధర్మదూషకుడుగా నున్నప్పుడు, నేనేమి చేయగలను? ఈ నా యవమానమునకు ప్రతిక్రియ యెట్లు చేయగలను? ఇతడు రాజై యుండికూడా రాజోచితమైన న్యాయమును చేయకున్నాడు. మత్స్య రాజా! నీయీ చోర ధర్మము ఈ సభకు కీర్తి తెచ్చునదికాదు. నీయెదుట కీచకుడు నన్ను కొట్టెను. ఇది యెప్పుడుగూడ యుక్తము కాదు. ఇక్కడ కూర్చున్న సభాసదులుగూడ కీచకుని అత్యాచారమును చూచుచునే యున్నారు. కీచకుడుగాని ఈ విరాటరాజుగాని ధర్మజ్ఞులు కానిమాట నిజమే. కాని యిట్టి రాజును సేవించుచున్న సభాసదులుగూడ ధర్మజ్ఞులు కారు!"

"జనమేజయా! ఈ విధముగా దుఃఖించుచు ద్రౌపది విరాటరాజును నిందించెను. ఆ మాటలు విని విరాటుడు "సైరంధ్రీ! మా పరోక్షమునందు మీ యిరువురికి జరిగిన కలహమునుగూర్చి నాకు తెలియని వాస్తవమును తెలిసికొనకుండ న్యాయ నిర్ణయము చేసినచో నా నేర్పు ఏమి తెలియగలదు!'' అని ద్రౌపదితోననెను "జనమేజయరాజా! ఆ తరువాత సభా సదులు, జరిగిన సమాచారమంతయు తెలిసికొని కీచకుని నిందించుచు, ద్రౌపదిని సాధువాదములతో అభినందించుచు నిట్లనిరి:

"ఇట్టి సర్వాంగ సౌందర్యవతిని భార్యగా పడసినవాడు ధన్యుడు. అట్టివాడు ఎట్టి శోకమునుగూడా పొందడు ఏ సైరంధ్రి శరీరము మంగళకరమై, పుష్టిగలదై, ముఖము కమలమును తిరస్కరించుచున్నదో, ఏ శోభనాంగి ముప్పదిరెండు దంతములు తళతళ మెరయుచున్నవో, కేశములు మృదువుగా సన్నగా నున్నవో, శంఖ-చక్ర-పద్మ-ధ్వజ-మందిర-మకరరేఖలు కరతలమునందు ఉన్నవో ఏ సాధ్వి శరీరమునందు ప్రదక్షిణముగా తిరిగిన సుళ్ళు నాలుగు ఉన్నవో, సమమై, నునుపై శుభమైన శరీరమో, ఏ కాంతయొక్క హస్త-పాద-దంతములందు ఛిద్రములు లేకున్నవో, పద్మ పత్రములవంటి కన్నులు గలదో, ఏ సర్వశుభ లక్షణ సంపన్నురాలి ముఖము పూర్ణచంద్ర సమమో, ఏశుభాంగి దేవతా స్త్రీవలెను, ఇంద్రపత్నివలెను విరాజిల్లుచున్నదో, అప్సరసవలెను రూపవతియో ఆటువంటి యీ సైరంధ్రి, కాలితో తన్నబడుటకు ఎంత మాత్రము తగదు. మనుష్య స్త్రీలలో ఇంతటి సౌభాగ్యవతి లేదు. ఈమెను దేవతగానే తలచుచున్నాము.'' జనమేజయ మహారాజా! ఈ



# దూసరపాము సగ్గు బియ్యం ఫ్యాక్టరీ

—శ్రీ పి. వి. సుబ్బారావు

తూర్పు గోదావరి జిల్లా ఎల్లవరం తాలూకా రాజ ఒమ్మంగి పంచాయతీ సమితిలో దూసరపాము గ్రామం ఒక ఏజన్సీ గ్రామం. ఈ గ్రామమందు వ్యవసాయము తప్ప వేరు జీవనాధారం లేదు. పూర్తిగా వర్షాధారమగుట వలన యితర ఋతువులందు యీ గ్రామస్థులకు పని లభించదు.

1977 మార్చి 11న యీ గ్రామానికి తలమానికంగా వెలసిన "శ్రీ విజయ పరమేశ్వరీ సగ్గు బియ్యము ఫ్యాక్టరీ"కి రాజ ఒమ్మంగి మండలాధికారి శ్రీ కె. ఎల్. నరసింహ స్వామి ప్రారంభోత్సవం చేశారు. ఈ ఫ్యాక్టరీ నిర్మాణమునకు యిద్దరు గిరిజనులు, మరి ఆరుగురు మధ్య తరగతి కుటుంబీకులు కృషి చేసి రూ. 1,25,000 లు పెట్టుబడి పెట్టి విజయం సాధించారు. ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్సు కార్పొరేషను వారు రూ. 1,00,000 లు ధన సహాయం చేశారు. ఈ ఫ్యాక్టరీ నడుపుటకు కావలసిన పెట్టుబడిని అడ్డ తీగల యూనియన్ బ్యాంకు ఆఫ్ ఇండియా వారు రుణంగా సమకూర్చారు.

రోజుకు 45 టన్నుల దుంపను ఆడగలశక్తి గల యీ ఫ్యాక్టరీలో నాలుగు మాసాలు మొదలు ఆరుమాసాలు 300 మందికి జీవనభృతి కల్పించబడింది. వారందరికీ రోజుకు రూ 4—00లు మొదలు రూ 6—00లు వారి పనిని బట్టి ఆదాయం లభిస్తుంది. ఒక పది మందికి మాత్రం సంవత్సరాంతము పూర్తిగా పని దొరుకుతుంది. ఈ ఫ్యాక్టరీ స్థాపన వలన యీ ప్రాంతములో 300 ఎకరాల్లో దుంప తోటల పెంపకము జరిగి సుమారు 60 కుటుంబాలు కూడా లబ్ధి పొందుతాయి. "ఇది మాకు జీవనాధారమైన ఆలయం" అంటారు చూడవచ్చిన గిరిజన యువకులు, రైతులు ఆశాజనకమైన ముఖాలతో.

కష్టించి పనిచేస్తే కలిమి బలిమి వస్తాయి

వచన కవితా రూపకం :

# కవితావేశం నా దేశం

—శ్రీ జె. ఎస్. రామ కృష్ణ

(గత సంచిక తరువాయి)

## రిక్షావాలా

అవును నేను
రిక్షా వాలాను
ఆనందంతో
ఆశయాంతో
ఈభువిపై ఇపుడే వెలశాను
అవును నేను రిక్షావాలాను

నాకాళ్ళకు రెక్కలొచ్చాయి
ఆకాశంలో చుక్కలు
చేతికి చిక్కాయి
కళ్ళ ముందు చీకట్లు
మటుమాయం అయ్యాయి
అవును నేను రిక్షావాలాను.

ఆశయాలతో
ఆదర్శాలతో
అవనిపై కొచ్చాను
ఆకాశం చేరువలో
మీకోసం మేడ కడతాను
ఆనందం పంచి పెడతాను

స్వేచ్ఛ కన్నమిన్న ఏది లేదని
స్వేచ్ఛ కోరు మనిషి కన్న
ఆరు దెవరు లేదని
నేడే తెలిసింది
నా మనసు తెలిపింది
శ్రమ శక్తిని లాగి...లాగి
జన శక్తిని దోచి...దోచి
శ్రమ సంపదను
నల్ల ధనంగా మార్చి
ఆకాశ హర్మ్యాలను పేర్చి పేర్చి
అందమైన పడగ్గదుల్లో
గుండె గుబుళ్ళతో
గుటక పడని షావుకార్ల
ఆట బందండి

—అంటూ పోతున్న రిక్షా వీరుణ్ణి
నాయకుడు పిలిచాడు
"ఏయ్ రిక్షా వీరా
ఇటు వస్తావా సోదరా"
"చిత్తం స్వామీ
ఎక్కండి బాబు
యేడ కెల్లాలి"
"నాగమ్యం నేను
చూసు కోలేదు
ఏ దారి రమ్యంగా
వుంటే అటు పోనియ్యి
వింతలను విశేషాలను చూద్దాం
ఆపైన ఆలోచిదాం''

'అల్లనే బాబు'

"సోదరా రిక్షా వాలా
నీకేది రక్ష.
ఇంత శ్రమ పడుతున్నా
ఏ మోహంలో ప్రశాంతి
సంతోషం ఎక్కడిన్నించి వచ్చాయి.
కారణం నేను తెలుసుకో వచ్చా
ఆ విషయం అడగొచ్చా.
అభ్యంతరం లేకపోతే
నీ చరిత్ర నాకు చెప్పు.''

"అట్లనే బాబు

తప్పకుండా చెప్పుత
నాదోయిపాద గాథ.
మీ లాంటి సదుంకున్నా వోరే
అర్థం జేసు కోవాల

అందరిలా నేనూ
పుట్టా నీమటి లో
ఇన్నాళ్ళు — నా ఇరవై యేళ్ళ,
బ్రతుకు గడించింది 'వెట్టి' లో
నా తాత బానిస
నా తండ్రి బానిస
ఏ నాడో మా తాత
ఓ వంద రూపాయలు
అప్పు తెచ్చిన పాపానికి
మా వాళ్ళ బ్రతుకంతా
వెట్టి చాకిరీలోనే గడిచింది
నా బ్రతుకు 'వెట్టి'లోనే
పొద్దు పొడిచింది.

ఉన్న భూమిని
తాకట్టు పెట్టించుకొని
తన్నుకు పోయారు రాబందుల్లా
పెరిగే వడ్డీని కట్టమంటూ,
తరుము కొచ్చారు డేగల్లా
బ్రతుకు కురుపులపై
మూగారు ఈగల్లా
ఆస్తిని దోచుకున్నారు
మా శ్రమ శక్తిని నల్లధనంగా
మార్చి చెప్పరాని చోట్ల
దాచుకున్నారు
మా శక్తి నశించింది
మా సత్తువ నీరు కారిపోయింది
బొమ్మల్లా విరిగాము
కొమ్మల్లా రాలిపోయాము.
రెమ్మల్లా రాలిపోయాము .
బడుగు జీవితంలో సోలిపోయాం.
కనుచూపు మేరలో కటిక చీకటి
కాలు ముందుకుపడదు.
కాలం వెనక్కు నడవదు.
జీవచ్ఛవాలమై
ధనవంతుల చేతుల్లో పావులమై
వారుచెప్పి నట్లు చేస్తున్నాము
వారు చేవిదిల్చింది మేస్తున్నాము.
మాకు హక్కుల్లేవు.
ఆశల్లేవు
బరువులు మోయటం
కలవారి పరువులు పెంచటం
మాకర్తవ్యం.
మాలో ఎవ్వడైనా కడుపుమండి
ఎదురు తిరిగితే
ఒళ్ళుమండి న్యాయమడిగితే
చెప్పేవాడు లేడు
వినే నాథుడు లేడు

ఇదీ బాబు నిన్నటి మావరిస్థితి
పగవాడి క్కూడా వద్దీ దుస్థితి''

స్వా :- అయితే నేడు
మీ బ్రతుకు మారిందా
గోదారిలా పారిందా
పగవాడి బ్రతుకు
పొగచూరిందా?

# రాపూరు తాలూకాలో నిమ్మపండ్ల ఉత్పత్తి

— శ్రీ టి. వేణుగోపాల్

నెల్లూరు జిల్లా రాపూరు తాలూకాలో నిమ్మపండ్ల ఉత్పత్తి అతి ప్రధానమైన వాణిజ్య పంట. ఎర్రరేగడి నేల ఎక్కువగా కలిగిన మెట్ట ప్రాంతముతో ఈ తాలూకా, నిమ్మతోటలు పెంపకమునకు అనుకూలమైన పరిస్థితులు కలిగి వున్నది. మాగాణి తక్కువ. సేద్యపు బావుల క్రింద నిమ్మతోటలు సాగుబడిచేయబడుతున్నవి. సుమారు 3.359 ఎకరములలో నిమ్మపంట సాగు చేస్తున్నారు.

పల్లపు భూములు, మురుగు నీరు పోవుటకు వసతిలేని బురదనేలలు, భూమి అడుగున నెమ్మగల మాగాణి భూములు చవుడు భూములు ఈ తోటలు వేయుటకు పనికిరావు.

తెగుళ్ళు లేకుండా పుష్టిగా ఏపుగా పెరిగే మంచిజాతి మొక్కలను ఎన్నుకోవాలి. మొగ్గను అంటుకు కావలసిన రూట్ స్టాక్కు, రంగపూరు లైమ్ వెక్కి మోన్ ప్రామాండన్, ట్రిపోలియే మొదలగువాటిని ఎన్నికచేసి వాటిపై బడ్డింగ్ తయారు చేయవలెను. వీటివలన నిమ్మజాతి చెట్లకు వచ్చే ట్రిస్టజా, గ్రీనింగు స్కారియాసిగ్, ఎక్సోకార్టిగ్ మొదలగు వైరస్ వ్యాధులను తట్టుకొనే శక్తి వున్నందున ఆ జబ్బులు తోటలకు రాకుండ నివారించవచ్చును. అంటు ద్వారాగాని, నేరుగా మొక్కల ద్వారాగాని నిమ్మ మొక్కలు నాటవచ్చును.

నిమ్మతోటలు వేయునపుడు పశువుల బారినుండి కాపాడుటకు చుట్టూ కంచె అవసరము. మొక్కలు నాటుటకు ముందు $2\frac{1}{2} + 2\frac{1}{2} + 2\frac{1}{2}$ సైజు గల గోతులను త్రవ్వి మొక్క మొక్కకు 24 అడుగుల దూరము వుంచాలి. మొక్కలు నాటేటప్పుడు గోతికి మధ్యలో మొక్కవుండే టట్లు నాటి దానిచుట్టూ మట్టిని చేతితో నొక్కవలెను. వర్షాకాలములో మొక్కలు నాటరాదు. ఎకరమునకు 75 నుండి 100 చెట్ల వరకు వేయవచ్చును. మొక్కలు నాటిన తర్వాత చుట్టూ పాదులు చేసి కాల్వల ద్వారా నీరు పారించవచ్చును. వర్షాలు పడితే వెంటనే వర్షపునీరు బయటకు పోవుటకు కాల్వలు చేయవలెను. ఎండిపోయిన చిన్న, చిన్న కొమ్మలను కత్తిరించి తీసివేయవలెను.

## సేద్య పద్ధతులు

మొక్కలు బాగా బ్రతికిన తర్వాత పెరిగేటప్పుడు వాటిచుట్టు కలుపుమొక్కలు తీసివేసి భూమిలో చెమ్మను నిల్వచేయు పద్ధతులు అనుసరించాలి. మొక్కలు బాగా వ్రేళ్ళు పెరిగిన తరువాత లోతుగా త్రవ్వరాదు. దీనివలన మొక్క వ్రేళ్ళకు దెబ్బతగులును, వేసవికాలంలో తేలికగా చిన్నచిన్న పారలతో కలుపు మొక్కలు తీసివేసి భూమిలో చెమ్మ నిల్వవుండునట్లు చేయాలి. నిమ్మచెట్లకు నీరు ఎక్కువగా పారించరాదు. 15 రోజుల కొకసారి అవసరమును బట్టి నీరు కట్టవలెను.

2, 3 సంవత్సరములవరకు మొక్కల సందులలో యితర పైర్లు అనగా రాగి, వేరుశెనగ, సజ్జ, మిరప, టమాటా మొదలగు వాటిని వేసుకొన వచ్చును. వీటికి యిచ్చే ఎరువుల వలన నిమ్మ మొక్క కూడ లాభమును పొందును. 3 సంవత్సరముల తరువాత మొక్కల మధ్య జనుము, పచ్చియాకు పైర్లు తప్ప యితరములు వేయరాదు. మొక్కలలో కొన్ని కొమ్మలు సూటిగా పెరిగి పూతనివ్వరి (Water Suckers) వచ్చునపుడు వాటిని తీసివేయవలెను. చిన్నప్పటి నుండి మైలుతుత్తము, సున్నపు ముద్దను మొదళ్ళలో బాగపూయవలెను. చెదళ్ళు లేకుండ మొదళ్ళను కాపాడవలెను. అవసరమునుబట్టి మందులను కలిపి పిచికారి చేయవలెను.

ఎరువులు వేయు పద్ధతి :— నిమ్మచెట్లకు ఎరువులు ఎంతో అవసరము. కాపుకురాని చిన్న మొక్కలకు ఎరువు వేసిన బాగా పెరిగి భవిష్యత్తులో మంచి కాపు యిచ్చుటకు అవకాశం కలదు. మొక్కలు నాటిన తరువాత (6—8 నెలల తరువాత) మొక్కలకు ఎరువుపెట్టవలెను. ఎండు కొమ్మలను కత్తిరించి చెట్లువేసినప్పటి నుండి 3 సంవత్సరము లోపు వాటికి చెట్టు ఒకంటికి ఒక కిలోగ్రాము ఆముదము పిండిగాని లేక వేపపిండిగాని వేయవలెను. కాపునిచ్చు మొక్కలకు అగస్టు నెలలో తప్పనిసరిగా ఎరువులు పెట్టవలెను. ఎరువులు మొక్కల మొదళ్ళలో వేయరాదు. ఎరువులు వేసిన తరువాత మొక్క స్వభావమునుబట్టి కొంత కాలము ఎండబెట్టవలెను. తర్వాత సమృద్ధిగా నీరు కట్టవలెను. మరియొకసారి పెద్దకాపు తీసుకున్న తరువాత అంటే ఏప్రిల్ నెలలో భూమిని దున్నిన మంచిది. చెట్లచుట్టు కలుపు తప్పని సరిగా తీయవలెను.

సస్యరక్షణ:— సస్యరక్షణ చాల ముఖ్యమైన అంశము. లేత మొక్కలకు ఆకు తిను పురుగు ఎక్కువగా పట్టును. చిన్నప్పుడు కూలీలను పెట్టి ఈ పురుగులను ఏకించ వచ్చును. లేదా బి. హెచ్. సి. 50 శాతము 1 ఔన్సు ఒక గ్యాలను నీటిలో కలిపి పిచికారి చేయవలెను. లేత నిమ్మ ఆకులు అడుగు భాగమున పేనుబంక రసమును పీల్చివేయును. తత్ఫలితముగ అవి వాడి రాలి పోవును. కాయలు ఏర్పడవు. దీని నివారణకు మలాథియాన్ లేక రోగార్ లాంటి మందులను పిచికారి చేయ వచ్చును.

ఎర్రలక్క తెగులు ఆకుల నుండి, కాయలనుండి రసమును పీల్చును. ఆకులు పసుపురంగు తిరిగి రాలిపోవును. కాయలు పక్వమునకు రాక పూర్వమే పసుపురంగుగా మారిపోవును. దీని నివారణకు నీటిలో గంధపు పొడిని ఒక ఔన్సు, 2 గ్యాలన్ల నీళ్ళ చొప్పున ఒక్కొక్క చెట్టుకు రెండుగ్యాలన్ల మందు ద్రావకం పిచికారి చేయవలెను.

నిమ్మ తోటలలో గజ్జి తెగులు అతి ముఖ్యమైనది. ఆకుల మీద, చిన్న కొమ్మల మీద, కాయలక్రింద ఒక్కొక్కప్పుడు ముళ్ళ

(తరువాయి 28వ పేజీలో)

# విజయవాడ
# రైల్వే వాగన్ల మరామ్మత్తు కర్మాగారం ప్రగతి



—కుమారి జి. కళ్యాణి గుణవతిదేవి

1974 ఏప్రిల్ మాసంలో శంఖుస్థాపన జరిగిన విజయవాడ వాగను మరామ్మత్తు కర్మాగారం పని చురుకుగా కొనసాగుతూంది. ఇది విజయవాడకు 12 కి. మీ దూరంలో రాయనపాడు, గుంటుపల్లి గ్రామాలకు దగ్గరగా 625 ఎకరాల విస్తీర్ణంలో ఏర్పాటు చేయబడింది దక్షిణ మధ్య రైల్వే ప్రాంతంలో నిర్ణీతకాలంలో రైల్వే వ్యాగన్లను మరామ్మత్తు చేయుటకు ఏర్పాటు చేయబడిన ఏకైక వ్యాగను రిపేర్ కర్మాగారమిది అన్ని రైల్వే వాగన్లను సాధారణంగా ప్రతి నాలుగు సంవత్సరముల కొకసారి, కొన్నింటిని ఆరు సంవత్సరముల కొకసారి పూర్తిగా మరమ్మత్తు చేసి మరల నాలుగు లేక ఆరు సంవత్సరములు పని చేయుటకు అనువుగా తయారు చేయవలసిన అవసరముంది.

15 కోట్ల రూపాయల ఖర్చుతో రూపొందించబడుతున్న ఈ ప్రాజెక్టుకు అత్యధిక ప్రాధాన్యత నివ్వడమే కాక, ఇప్పటివరకూ వివిధ భవనముల నిర్మాణానికి, మెకానికల్, ఎలక్ట్రికల్, సిగ్నల్, టెలీ కమ్యూనికేషన్ యంత్రములు నెలకొల్పుటకు 6.5 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. ఇప్పటివరకూ 6.5 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. రెండు మూడు సంవత్సరాల తరువాత పనికివచ్చే భవనముల నిర్మాణం, పరికరముల కొనుగోలుకు అనవసరంగా ఇప్పుడే పెద్ద మొత్తాల ధనమును ఖర్చుచేయక, వెంటనే ఉత్పత్తులను పెంచే పనులను చేపట్టుట ఈ కర్మాగార నిర్మాణంలోని ఆసక్తికరమైన విషయం. క్రొత్త యూనిట్లు నిర్మించి, నూతన యంత్రములను నెలకొల్పుటతోపాటు ఉత్పత్తి



క్షేపట్టబడింది. ఇప్పటి వరకు నెలకొల్పిన యంత్ర పరికరాలతో వాటి విలువకు తగ్గ ఉత్పత్తిని సాధించుటకు ప్రయత్నాలు జరుగుతున్నవి.

సంవత్సరానికి 13,600 వ్యాగన్ల మరామ్మతుకు నిర్దేశింపబడిన ఈ కర్మాగారంలో ప్రస్తుతం రోజుకు 2.6 వ్యాగను మరామ్మతు చేయబడు తున్నవి. 1980-81 సంవత్సరాంతానికి రోజుకు 50 వ్యాగన్లు రిపేరు చేయడానికి వీలవుతుంది ఈ కర్మాగారం ప్లానులో భవిష్యత్తులో 50 శాతం అభివృద్ధిచేయడానికి అవకాశం కల్పింపబడింది. అందు కవసరమగు భూమి గూడా సేకరించడమైనది. స్ట్రిప్పింగు షాపు (Stripping Shop) వీల్ షాపు (Wheel Shop), స్టోర్సుషెడ్ (Stores shed), కమ్మరం, స్ప్రింగు షాపులు ఏర్పాటు చేయబడినవి. ఈ ప్రాజెక్టుకు కావలసిన నీటిని కృష్ణానది నుండి 40 లక్షల రూపాయల ఖర్చుతో 4000 మీటర్ల పైపు లైను ద్వారా సరఫరా చేయబడుతుంది. ప్రాజెక్టుకు అవసరమగు 2000 కిలోవాట విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాటు చేయబడింది.

సంక్షేమ పథకాలు :— ఈ ప్రాజెక్టులో పనిచేసే సిబ్బంది సంక్షేమంకొరకు 1972 వివిధ రకాల గృహాలను నిర్మిస్తున్నారు. అదనంగా 2000 గృహాలను భవిష్యత్తులో నిర్మించడానికి అవకాశం కల్పించారు 10 లక్షల రూపాయల ఖర్చుతో 25 పడకల ఆసుపత్రి నిర్మాణం చురుకుగా సాగుతున్నది. ఒక ఫలహారశాల, మార్కెట్టు, పాఠశాల భవనములు నిర్మింపబడుతున్నవి. ఈ కర్మాగార ప్రాంతంలో నీడ నివ్వడానికి, వాతావరణం చల్లబడడానికి కొన్ని వేల మొక్కలు నాటబడినవి. ఈ కర్మాగారం, సిబ్బంది కాలనీలలో 9.2 కిలోమీటర రోడ్లు వేయబడినవి.

15 మంది గజెటెడ్ ఆఫీసర్లు, 200 సూపర్‌వైజర్లతో సహా 4500 మందికి ఈ ప్రాజెక్టులో ఉద్యోగావకాశాలు కల్పింపబడినవి ఈ కర్మాగారంలోని వివిధ విభాగాలలో పని చేయుటకు రాబోవు 3 సంవత్సరాలలో 800 మంది పనివారికి దశల వారీగా శిక్షణ ఇవ్వబడుతుంది.

ఈ కర్మాగార నిర్మాణంలో ముఖ్య అధికారులైన ఇంజనీర్ ఇన్-చీఫ్ (నిర్మాణం) శ్రీ మీర్ లియాఖత్ ఆలీ, డిప్యూటి చీఫ్ ఇంజనీర్ (మెకానికల్) శ్రీ గోపాల్‌రెడ్డి రైల్వేబోర్డు సకాలంలో నిధులను విడుదల చేయుటలో పూర్తి సహకారం, తోడ్పాటు నివ్వడం ద్వారా ఈ కర్మాగార నిర్మాణం ఉద్దేశింపబడిన కాలంలో పూర్తి అవుతుందని ఆశిస్తున్నారు.

---

## రాపూరు తాలూకాలో నిమ్మపండ్ల ఉత్పత్తి

(26వ పేజీ నుండి)

మీద కూడ ఈ గజ్జి తెగులు కనిపించును. ఆకుల మీద పసుపుపచ్చ వర్ణపు మచ్చలుగా ప్రారంభించి పెద్దవై గోధుమ వర్ణములో కనిపించును. మచ్చల చుట్టు వున్న ఆకు భాగము గుండ్రముగా పచ్చబడును. ఆకులు రాలి పోవును. చిన్న కొమ్మలు ఎండి పోవును. కాయలపై భాగమున మాత్రమే గజ్జి తెగులు కనిపించును. నిమ్మపండ్లకు ధరరాదు. దీని నివారణకు తెగులు సోకిన కొమ్మలను వర్షములు రాకముందే కత్తిరించి తగుల పెట్టుట మంచిది. రాగి ధాతు సంబంధమైన మందుగాని లేక జింకు సంబంధమైన మందులు 1 బొమ్మ 2 గ్యాలన్లు నీటిలో కలిపి మొక్కకు 2 గ్యాలన్లు చొప్పన పిచికారి చేయవలెను. బంక తెగులు ప్రతి తోటలో కనిపించును. ఈ తెగులు కనిపించిన భాగమును కత్తితో కోసి బోర్డోపేస్టు పూయవలెను. పూసిన పిదప రాగి సంబంధమైన మందుతో పిచికారి చేయవలెను.

జింకు లోపము విరివిగా నిమ్మతోటలలో కనిపించును. ఈనెలు పసుపురంగుగా వుండి, తర్వాత ఆకు అంతయు పచ్చగా మారును. చిన్న చిన్న ఆకులు వేయును. చెట్టు బలహీనతను ఈ రోగము తెల్పును. దీని నివారణకు 2 కిలోగ్రాముల జింకు సల్ఫేటు, ఒక కిలోగ్రాము పొడి సున్నము కలిపి 40 గ్రాముల నీటిలో కలిపి చెట్టుకు 1/2 గ్యాలను తక్కువగాకుండ పిచికారి చేయవలెను.

పైన తెల్పిన విధముగా నిమ్మ కృషి శ్రద్ధతో చేసినయెడల మంచి ఫలితము పొందవచ్చును. ఎకరమునకు రూ. 8 000/- లు నుండి రూ. 10,000/- ల వరకు లాభము పొందవచ్చును.

రవాణా పద్ధతి :— నిమ్మకాయలు గ్రేడింగుచేసి వరిగడ్డితో నింపిన గోనె సంచులలో బస్తా ఒకటికి 800 నుండి 1000 కాయలు వుంచి ఎగుమతి చేయుదురు. నిమ్మకాయలు ఆకుపచ్చ రంగులో వున్న సమయములో కోయుదురు. ఆ విధముగా కోసి గోనె సంచులలో నింపి పంపిన చాలకాలము నిల్వవుండి వాడకము వచ్చునప్పటికి పసుపు రంగు వచ్చి వుపయోగముగ వుండును.

మార్కెట్ సదుపాయములు :— తాలూకాలోని నిమ్మసాగు రైతులు పండించిన నిమ్మకాయలను ఉత్తర హిందూస్థానములోని ఢిల్లీ, నాగపూరు, లక్నో, కలకత్తా, బొంబాయి మొదలగు ప్రాంతములకు స్థానిక కమీషను కొట్ల ద్వారాను, ఒక్కొక్కప్పుడు రైతే నరాసరి వ్యాపార కేంద్రములకు సరఫరా చేయుచున్నారు. రైతులు ఎక్కువగా యీ వ్యాపారమును మార్చి నెలనుండి మే నెల వరకు చేయుదురు 1000 నిమ్మకాయలు రూ. 50 ల నుండి రూ. 140 ల వరకు గిరాకినిబట్టి అమ్ముదురు. రైతులకు పై వ్యాపార ప్రాంతములనుండి పైకము డ్రాఫ్టు ద్వారా, పోస్టల్ యిన్సూర్‌ద్వారా పంపుతుంటారు. రైతులు వ్యాపార స్థలమునుండి అడ్వాన్సుగా కూడ డబ్బు తీసుకొని వారికి నిమ్మకాయలు సరఫరా చేయుచున్నారు.

# నిరాశలో నిండు గుండె

—సి. ఆనందారామం

జరిగిన కథ: శ్యామ్ తండ్రి జనార్దన్‌వద్ద పెరిగిన సి. ఐ. డి. అధికారి మోహన్ లోటస్ హోటల్ యజమాని సాంబశివం చేస్తున్న దొంగనోట్ల వ్యాపారం పట్టివ్వడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రసూన, చిరంజీవి మోహన్‌కు సహాయం చేస్తున్నారు. ఈ కేసు నుండి ప్రసూనను దూరం చేయమని సుశీలను కోరుతాడు శేఖర్. పరమేశ్వరి సహృదయుల సాయంతో కూలిపేటలో అనాథసేవ చేస్తుంది.

జపాన్ త్రీ-ఇన్-వన్ సెట్టు రేఖ ప్రోత్సాహంతో దొంగిలించి పట్టుబడిపోతాడు శ్యామ్. శ్యామ్ దొంగతనం చేస్తూండగా తీసిన ఫోటోలను తనకిచ్చి అతడిని వదిలివేయమని ప్రాధేయపడి మోహన్‌ను అక్రమ ప్రవర్తనకు గురి చేస్తాడు జనార్దన్. ఈ విధంగా సాంబశివం పన్నిన "ట్రాప్" అర్థమౌతుంది మోహన్‌కు. ప్రసూన మోహన్‌ను తృణీకారభావంతో నిందిస్తుంది.

## —21—

హోటల్‌లో దొంగనోట్ల మారకం జరుగుతోందే కాని ముద్రణ జరగటంలేదని గ్రహించాడు మోహన్. సాంబశివాన్ని సాధ్యమయినంతగా కనిపెట్టి, హోటల్‌కు, ఇంటికేకాక సాంబశివం వెళ్ళే ప్రదేశాలు తెలుసుకోమని చిరంజీవికి చెప్పాడు. చిరంజీవి చురుకైనవాడు. సాంబశివం కార్యక్రమాలగురించి పూర్తి రిపోర్టు మోహన్‌కు అందించాడు.

"సాంబశివం రోజూ క్లబ్‌కు వెళతాడు సార్! ఖరీదైన క్లబ్‌లన్నింటిలోను ఆయనకు మెంబరుషిప్ ఉంది. బార్‌కుకూడా వెళతాడు. ఫ్రెండ్స్ ఇళ్ళకు వెళ్ళడు కాని ప్రముఖులయిన రాజకీయ నాయకులతో ఎలాగో ఒకలాగ స్నేహం చేసుకోవాలని ప్రయత్నిస్తాడు. వాళ్ళను పార్టీలకు ఆహ్వానిస్తాడు. మిక్కిలి చిత్రం! ఆయన ఇంట్లో ఉన్న సర్వెంట్ క్వార్టర్స్‌కి వెళుతుండగా ఒకటి రెండుసార్లు చూశాను ........''

చిరంజీవి మొదటిమాటలన్నీ యథాలాపంగా విన్న మోహన్ చివరి మాటలు వినగానే ఎలర్ట్‌గా అయాడు.

"ఎవరిదాయిల్లు?"

"తెలియదుసార్! ఎప్పుడూ తాళంవేసి ఉంటుంది. ఇంటి ముందు ఘూర్ఖామాత్రం ఉంటాడు. ఇల్లు చిన్నది కాని కాంపౌండ్ విశాలంగా ఉంటుంది. పెద్ద గార్డెన్. ఆ సర్వెంట్ క్వార్టర్స్‌లో ఉండేది తోటమాలి అనుకుంటా.''

"నాకా ఇల్లు చూపించగలవా?"

"ఓ యస్ ........"

ఆరోజే చిరంజీవితో కలిసి ఆ ఇంటికి వెళ్ళాడు మోహన్. ఆ యింటిని చూడగానే అతని నవనాడులు కృంగిపోయాయి. ఆ యిల్లు మోహన్‌కి బాగా తెలుసు, అది చాలా చాలా పలుకుబడి ఉన్న ఒక ప్రఖ్యాత రాజకీయ నాయకుడిది. అతను ఎప్పుడూ ఢిల్లీలోనే ఉంటారు. ఎప్పుడైనా వచ్చినపుడు ఈ ఇంట్లోనే ఉంటాడు. అప్పుడు మాత్రం ఈ ఇల్లు సందడిగా ఉంటుంది మిగిలిన సమయాల్లో తాళంవేసి ఉంటుంది. ఇదివరలో ఈ విషయం అతిమామూలుగా తోచింది మోహన్‌కి! ధనవంతులకు దేశంలో అనేకచోట్ల ఇళ్ళు ఉండడంలో ఆశ్చర్యంలేదు. డబ్బుంటే లక్ష్యం లేదు గనుక కొన్ని కొన్ని ఇళ్ళు అద్దెకివ్వకుండా వాళ్ళకిందే ఉంచుకుంటారు.

కానీ, ఇప్పుడు — సాంబశివం ఆ ఇంట్లో సర్వెంట్ క్వార్టర్స్‌కి వెళుతున్నాడనే విషయం విన్నాక అనేక ఆలోచనలు ముసురుకున్నాయి. సాంబశివం తర తమ భేదా లెన్నక సేవకులతో స్నేహం చేసే రకం కాదు, ఏదైనా పని ఉన్నా అలాంటి వాళ్ళను తన కాళ్ళదగ్గిరకి రప్పించు కుంటాడేగాని తానై వెళ్ళడు.

ఎన్ని అనుమానలున్నా ఏమైనా, తనాఇంటిని సోదా చెయ్యటానికి వీలేదు. ఆ వ్యక్తి తలచుకుంటే తనలాంటి వాళ్ళను ఏమైనా చేయగలడు, అందుకు భయంకాదు. కానీ తనది అనుమానం మాత్రమే. అది నిజమని దృఢ పరుచుకోవడానికి ఆధారాలు దొరకాలి! అలాంటి ఆధారము దొరికితే రైడ్ చేయ్యటానికి ఎవ్వరికీ భయపడడు. కానీ ఏమీచేయకుండా తను ఎటు అడుగు కదిపినా, ఆపదలూ, అవమానాలూ, కొనితెచ్చుకోవడం తప్ప ఏమీ ప్రయోజనం ఉండదు.

కానీ, తన అనుమానం నిజమో, నిరాధారమో ఎలా తెలుస్తుంది? నిజమే అయితే సాంబశివం తగిన జాగ్రత్తలోనే ఉంటాడు. సాంబశివం దగ్గర నమ్మకం సంపాదించుకొన్నవాళ్ళు ఎవరైనా ఉంటే గాని ఇది సాధ్యంకాదు.

విషయం అర్థంచేసుకున్న చిరంజీవి ఆలోచనలో పడ్డాడు అతనికేదోమెరుపులా స్ఫురించింది, "కొంచెం టైమివ్వండి, సార్! నేనొక ఉపాయం ఆలోచిస్తాను-" అన్నాడు.

"ఆలస్యమవుతున్నకొద్దీ పరిస్థితి మరింత పాడవుతుంది చిరంజీవీ!" చికాగ్గా అన్నాడు.

"తొందర పడకండి సార్! రెండు మూడు రోజుల్లోనే మిమ్మల్ని కలుస్తాను."

అంగీకార సూచకంగా తలఊపాడు మోహన్...సాంబశివం విశ్వాసం చూరగొన్నవాళ్లు, తనకు సహకరించేవాళ్లు ఎవరా అని ఆలోచించసాగాడు మోహన్. రేఖ గుర్తుకొచ్చింది. కానీ సాంబశివం రేఖను నమ్ముతాడా ? ఆ మాట కొస్తే తను నమ్ముతాడా ?

చూడాలి !

ఆరోజే చిరంజీవి! ప్రసూనను కలుసుకున్నాడు. ఏదో యథాలాపంగా చెప్పినట్లు జరిగినదంతా ప్రసూనకు చెప్పాడు ...

"ఎవరయినా సాంబశివం నమ్మకం సంపాదించుకున్న వ్యక్తుల సహాయపడితే తప్ప లాభం లేదని బాధపడుతున్నారు మోహన్ !" అన్నాడు.

"చిరంజీవీ! నువు నాకొక సహాయం చేయగలవా" ఆలోచిస్తూ అంది ప్రసూన....

ప్రసూనలో ఇలాంటి రియాక్షన్ ఆశించే చిరంజీవి ప్రసూనకు సంగతులన్నీ చెప్పాడు- అయినా అమాయకంగా "ఏమిటి ?" అన్నాడు.

" నువ్వు మోహన్‌తో నా పేరు చెప్పకు. సాంబశివం ప్రేమించే వ్యక్తి నీకు తెలుసునని- ఆవిడద్వారా ప్రయత్నిస్తానని చెప్పు- ఎలాంటి సహాయం కావాలో అడుగు"

" సాంబశివం గారు మిమ్మల్ని ప్రేమిస్తున్నారా? " పట్టరాని ఆశ్చర్యంతో అడిగేశాడు చిరంజీవి...

ప్రసూన సిగ్గుపడింది...సంకోచపడింది. " ఏమో మరి, అలానే అనిపిస్తుంది. నాతో ఎప్పుడూ స్పష్టంగా ఏమీ అనలేదనుకో..."

" అయితే మీరు ... "

" అవన్నీ నీకనవసరం! నా సహాయం కావాలనుకుంటే నేను చెప్పినట్లుచెయ్యి " మందలిస్తూ అంది.

చిరంజీవికి ప్రసూన సహాయపడతాననడం రుచించింది కానీ. మిగిలిన విషయాలు రుచించలేదు ...

ప్రసూన చెప్పమన్నట్లే మోహన్‌కు చెప్పాడు- మోహన్ సి.ఐ.డి. ఆఫీసర్ ...చిరంజీవి పేరుచెప్పకపోయిన ఆవ్యక్తి ఎవరో ఊహించగలిగాడు.

"ఆవిడే చెప్పిందా, సాంబశివం తనను ప్రేమిస్తున్నాడని?"

సాధ్యమయినంత నిగ్రహంతో అడిగాడు.

"అవునుసార్!"

"మరి, ఆవిడ ఆ ప్రేమను అంగీకరించినట్లేనా?"

చిరంజీవి సిగ్గుపడిపోయాడు.

"నాకు తెలియదు సార్!" అని ఒక్కక్షణం ఆగి అన్నాడు.

"అలా అయివుండదు సార్? మనకు సహాయంచేస్తానని ఎందుకంటుంది? "

"అన్నంత మాత్రాన అయిపోయినట్లేనా? "

"నాకు తెలుసు సార్! ఆవిడ అలాంటిది కాదు! "

రోషంతో కచ్చితంగా అన్నాడు.

మోహన్ నవ్వి "చిరంజీవీ! ఎవరూ ఎవరికీ ఊరికే సహాయం చెయ్యరు! తను చెయ్యబోయే సహాయానికి ఆవిడ కోరే మూల్యం మునుముందుగానే నిర్ణయించు-" అన్నాడు.

చిరంజీవి మోహన్ మాటలు ప్రసూనతో చెప్పాడు

ప్రసూన రోషంతో "నేను అందించే సహాయాన్ని స్వార్థంతో అమ్ముకోకుండా ఉండటమే నేను కోరే మూల్యం" అంది.

ఈ సమాధానంతో మోహన్ అనుమానాలు పటాపంచలయిపోయాయి. "సూనా? నీకి అవకాశం ఇస్తున్నాను. నువ్వు ఇచ్చే అవకాశాన్ని అందుకుంటాను" అనుకున్నాడు తనలోతను.

చిరంజీవిని పిలిచి, ఒక రిస్ట్ వాచ్, ఒక పైటపిన్ను చూపించాడు....

"ఇది పైకి రిస్ట్‌వాచ్‌లా కనిపిస్తూనే అవసరమైనపుడు రికార్డర్‌గా ఉపయోగపడుతుంది. ప్రతి చిన్న శబ్దాన్నీ రికార్డ్ చేస్తుంది. ఈ పైట పెన్ను మధ్యలో ఉన్న లాకెట్‌లో కెమెరా సిస్టమ్ ఉంది. ఎదుటి వ్యక్తులకు తెలియకుండా ఫోటోలు తీయవచ్చు. ఇవి రెండు ఆవిడకియ్యి. ఎలాంటి సహాయం చేస్తుందో చూద్దాం!"

అవస్తువులు అతి జాగ్రత్తగా అందుకున్నాడు చిరంజీవి...

"జాగ్రత్తగా! చిరంజీవీ! ఎవరిని పడితే వాళ్ళను నమ్మకు! హెచ్చరింపుగా అన్నాడు మోహన్...

"ఎందుకు సార్! మీకు లేని జాగ్రత్త నాకు చెపుతారు!'

"అదేమిటి?"

"అంతేమరి! మీకు నమ్మకం లేకపోతే ఈ వస్తువులు నాకిచ్చేవారా?"

మోహన్ ఆశ్చర్యంగా కనుబొమలు పైకెత్తి చిరంజీవి భుజం తడుతూ నవ్వాడు.

సాంబశివం సుశీలకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు. ఏ సంబంధము ఒకంతట అతనికే నచ్చలేదు. తన సుశీలకు చాలా చాలా అపురూపమైన వరుడు రావాలి. అదే అతని సంకల్పం. ఎలాగయితేనేం ఒక సంబంధం వచ్చింది. వరుడు డాక్టరు. చాలా అందంగా ఉంటాడు. మంచి కుటుంబం. ఈ సంబంధం లలితకుకూడా నచ్చింది. వరుడి ఫోటోను సుశీలకు చూపించి"చూడు! నీకు నచ్చిదా పెళ్ళి చూపులకు పిలవమంటేనే పిలుస్తాను" అన్నాడు సాంబశివం.

అప్పటికి శేఖర్ తమ ప్రయాణానికి తేదీకూడా నిశ్చయించాడు. సరిగ్గా ఆరోజుకి పదిహేను రోజులే ఉంది ప్రయాణం.

"నాన్నా! నా పెళ్ళి విషయంలో నీఅభిప్రాయమేమిటో చెప్ప నీకేం కావాలి? నువ్వు సెలెక్టు చేసిన వ్యక్తినే. నేను చేసుకోవటమా? లేకపోతే ఎవరిని చేసుకున్నా నేను సంతోషంగా ఉండటమా?"

"అదేం ప్రశ్న! నువ్వు సంతోషంగా ఉండటమే కావాలి! నువ్వు ఎవరిని చేసుకుంటా నంటే వాళ్ళకే ఇచ్చిచేస్తాను. ఎలాంటి వాడైనా సరే! ఎక్కడున్నా సరే!''

తమ సంగతి ఏ పరిస్థితులోనూ బయటికి రానీయకూడదని అది చాలా ప్రమాదమనీ శేఖర్ మరీ మరీ నొక్కి చెప్ప బట్టి సుశీల నిగ్రహించుకుంది కాని లేక పోతే శేఖర్ సంగతి తండ్రికి చెప్పేసి తండ్రి అంగీకారంతో, ఆశీర్వాదంతో పెళ్ళి చేసుకోవాలని ఎంత గానో ఆరాటపడింది.

నవ్వుతూ "ఎక్కడున్నా సరేనా?'' అని రెట్టించింది

"ఆ! ఎక్కడున్నా సరే! చివరకు విదేశాలలో ఉన్నా సరే!'' గతుక్కు మంది సుశీల.

"కానీ. నేను నిన్ను చూడకుండా ఉండలేను. నువ్వెక్కడున్నా, ఎంత దూరంలో ఉన్నా నిన్ను వెతుక్కుంటూవస్తాను.........''

పకపక నవ్వింది సుశీల.

లలిత సాంబశివం కంటె మరింత ఆదరంతో మాట్లాడింది.

"బాగా ఆలోచించుకో సుశీ! చదువుకున్నవాడనికానీ, ఉద్యోగస్థుడని నీ భ్రమపడకు. నిజంగా నీ మనసుకు నచ్చితేనే చేసుకో!"

"నా మనసుకు నచ్చటమే నీకు ప్రధానమా అమ్మా! ఎవరిని చేసుకున్నా, నీకు అభ్యంతరం ఉండదా?"

ఆశగా అడిగింది సుశీల.

" ఇంకా నెమ్మదిగా అడుగుతున్నావా? పశువు నుండి మనిషిని వేరు చేసేది ఏమిటి! మనసేగా! మనం మనుష్యుల మయినా అనుక్షణం మనసును చంపుకొని బ్రతుకుతున్నాం. మనసు లేని దాంపత్యజీవితం కంటె నరకం మరొకటి ఉండదు. నువ్వు నాకు దూరమైనా భరించగలను. కాని మనసు లేనివాణ్ణి చేసుకుంటే మాత్రం భరించలేను''

తన మాటలకు తనే భయపడినట్లు గతుక్కున ఆగిపోయింది లలిత.

"అది సరే! ఈ మాటలన్నీ ఏమిటి? నీ మనసులో ఏమైనా ఉందా?''

అంది సుశీలను పరిశీలనగా చూస్తూ......సుశీల ఒక్కక్షణం తొట్రుపడి "ఏమీలేదు_'' అనేసింది.

ఒక్కొక్కరోజు గడిచి శేఖర్‌తో తను వెళ్ళిపోవలసిన రోజు దగ్గిర పడుతున్నకొద్దీ సుశీల మనసులో బరువు పేరుకో సాగింది.

'' అమ్మా! నా పెళ్ళికి ఎలాంటి చీర కొనాలనుకుంటు న్నావో, ఇప్పుడేకొను...'' అంది సుశీల.

లలిత తెల్లబోయింది.

" అదేమిటి? ఇంకా పెళ్ళిచూపులైనా కాలేదు. అప్పుడే పెళ్ళిచీరా?"

పెళ్ళికి మరోచీర కొందువుగాని ఇప్పుడు సరిగ్గా నా పెళ్ళికి నువ్వెలాంటి చీర కొనాలనుకుంటున్నావో అది కొను— నాకు ఇప్పుడే కట్టుకోవాలని ఉంది ..''

సుశీలకు చీరలమీదా అలంకరణమీదా ఉన్న వ్యామోహం లలితకు తెలుసు. అప్పుడప్పుడు అంత వ్యామోహం తగదనిపించినా మందలించలేకపోయేది. ''పోనీ చిన్నపిల్ల!'' అనుకునేది. కొనియ్యగలిగే తాహతున్న తండ్రి! కొత్తరకాలన్నీ కొనుక్కోవాలని కుతూహలపడే కూతురు! సుశీలకున్న చీరలకు లెక్కలేదు!

లలిత సుశీలను వెంటబెట్టుకుని బజారుకు వెళ్ళింది. సాధారణంగా 'అది నచ్చలేదు' 'ఇది నచ్చలేదు' అని వంకలుపెట్టే సుశీల ఆరోజు చీర ఎన్నిక పూర్తిగా లలిత ఇష్టానికే వదిలేసింది.

ఆ సాయంత్రమే లలిత కొన్నచీర కట్టుకుని పెళ్ళికూతురులా తయారయి లలిత పాదాలకు నమస్కారం చేసింది సుశీల...నివ్వెరపోయింది లలిత.

" ఏమిటే ఇది? "

సుశీల నవ్వుతూ ''సరదాగా నమస్కారం చేశానమ్మా! ఆశీర్వదించరాదూ! ' అంది.

సుశీల నవ్వుచూసి లలితకు ఏ అనుమానము రాలేదు. పైగా ఇలాంటి ఆకతాయితనం సుశీలకు అలవాటే!

" నువ్వు మనసారా ప్రేమించే భర్తను పెళ్ళిచేసుకుని అతని హృదయపూర్వకమైన ప్రేమను పొంది కలకాలం ఆనందంగా బ్రతుకు''.

కలకల నవ్వింది సుశీల_ ఆ నవ్వు విని మురిసిపోయింది లలిత.

తండ్రి రాగానే తండ్రికీకూడా నమస్కారం చేసింది సుశీల.

పట్టుచీరతో అందంగా ఉన్న సుశీలను చూసి మురిసిపోయిన సాంబశివం 'నమస్కారం ఎందుకు' అని కూడా అడుగ లేదు.

"కలకాలం అష్టైశ్వర్యాలతో సుఖంగా ఉండు_" అని ఆశీర్వదించాడు_ లోలోపల చాలా బాధపడింది సుశీల.

ఇంటికి ఫొటోగ్రాఫర్‌ను పిలిపించింది. తల్లినీ తండ్రినీ పక్కల పక్కల కూర్చోబెట్టి తనుమధ్యన నించొని ఫొటో తీయించు కోవాలని పట్టుబట్టింది. ఇటీవల తమను దగ్గిర చేయాలని సుశీల చేస్తున్న ప్రయత్నాలు లలితకు, సాంబశివానికి ఆనందాన్నే కలిగిస్తున్నాయి. సాంబశివం గర్వంగా వచ్చిపోతున్నాడు_ ఒక్క

క్షణం తటపటాయించిన లలితను సుశీల "రా, అమ్మా!" అనగానే వచ్చేసింది. యిద్దరి మధ్యానించుని రెండు చేతులు ఇద్దరిమీద వేసింది సుశీల — ఫోటో చక్కగా వచ్చింది ... సాంబశివం గ్రాండుగా ఫ్రేం కట్టించి తనగదిలో గోడకు వేలాడ దీసుకున్నాడు. లలిత స్టాండులో ఫిక్స్ చేసి డ్రెసింగ్ టేబుల్ మీద పెట్టుకుంది. సుశీల దానిని అపురూపంగా తన సూట్ కేస్‌లో సర్దుకుంది...

బొంబాయికి స్నేహితులతో ఎక్స్‌కర్షన్ కని బయలుదేరింది సుశీల.. అటునుంచి అటే శేఖర్‌తో వెళ్ళిపోవాలని ప్లాన్.

బొంబాయి ప్రయాణానికి అన్నీ స్వయంగా సర్దుతోంది లలిత. తల్లిని చూడాగానే సుశీలకు దుఃఖం ఆగలేదు — డబ్బుకు ఆశ పడాలేదు. కోరాలేదు. తనకోసం కేవలం తన కోసంమనసును చంపుకొని బ్రతుకుతుంది తనకోసం కాకపోతే ఆవిడ మనసుకు ఇష్టం లేని పనిని చేయించడం, ఎవరి వల్లా అయ్యేది కాదు. అలాంటి తల్లి తను దూరమయ్యాక ఎలా బ్రతుకుతుంది? లలితను కావలించుకుని వెక్కి వెక్కి ఏడ్చేసింది సుశీల. "ఏమిటి సుశీ? ఎక్కడికో శాశ్వతంగా వదిలి వెళ్తున్నట్లు బాధపడుతున్నావేమిటి? ఇదివరకు ఎన్ని సార్లు స్నేహితులతో వెళ్ళ లేదు? రాలేదు?"

"ఏం లేదమ్మా!" అంటూ కళ్ళు తుడుచుకుంది సుశీల— సుశీల ముఖం చూసిన లలితకు ఎలానో అనిపించింది "పోనీ, అంత బెంగగా ఉంటే వెళకు—" అంది.

కంగారు పడింది సుశీల —

"అహా! నేను వెళ్ళి తీరాలి!" అంది.

బొంబాయి వెళ్ళబోయే ముందు హోటల్‌కి వెళ్ళి తండ్రిని కలుసుకుంది సుశీలలో.

"నాన్నా! నీకు ఏదైనా బహుమానం ఇస్తాను. నీకేది ఇష్టమో చెప్పు .."

"నీకంటె నాకు ఇష్టమైనదేముందీ ?"

"అలాకాదు! చెప్పు ?"

"ఆల్‌రైట్! నీ ఫోటో ఉంటే ఇయ్యి..." నవ్వుతూ అన్నాడు సాంబశివం.

అమాయకంగా నవ్వుతున్న సాంబశివాన్ని చూస్తూ కన్నీళ్ళు నిగ్రహించుకోవటం కష్టమయింది సుశీలకి.

తన పాస్‌పోర్టు సైజు ఫోటో తీసి సంతకంవేసి తండ్రికి ఇచ్చింది. అది జాగ్రత్తగా తన డైరీలో దాచుకున్నాడు సాంబశివం.

సుశీల బొంబాయి చేరుకున్న మరునాడే పోలీస్ డిపార్టుమెంట్ నుండి ట్రంక్ కాల్ వచ్చింది సాంబశివానికి.

"టాక్సీలో వెళుతున్న యువతీ యువకులిద్దరూ అతి దారుణంగా హత్య చెయ్యబడ్డారు. యువతి మీ కుమార్తె అని ఆధారాలబట్టి అనుమానింపబడుతోంది. మీరు వెంటనే వచ్చి గుర్తించండి—"

పోలీస్ డిపార్ట్‌మెంట్ నుండి ట్రంక్ కాల్ వచ్చిన మరికొన్ని క్షణాలలోనే ఇంకొక ట్రంక్ కాల్ వచ్చింది సాంబశివానికి. అవతలి వైపు కంఠం వింటూనే గడ్డ కట్టుకుపోయాడు సాంబశివం...

"అయామ్‌సారి సాంబశివం! మన నీతికి స్వపరభేదం లేదు. ఒకసారి మన రాకెట్‌లోకి వచ్చిన వ్యక్తి ప్రాణాలతో బయట బడటానికి వీల్లేదు—నువ్వు ముందుగానే జాగ్రత్త పడవలసింది..."

ఇంక గుర్తించవలసిన అవసరమేమీ లేకుండానే ఆ వ్యక్తి సుశీల అని అర్థమయిపోయింది. హంతకులను పోలీస్ డిపార్టుమెంట్ కనిపెట్టలేకపోవచ్చు...కానీ ఎవరో సాంబశివానికి రూఢిగా తెలుసు—కానీ.. కామీ...ఏమీ చెయ్యలేదు.

భరింపరాని శోకంతో తల్లడిల్లిపోతున్న లలితను తీసుకుని ఎలాగో బొంబాయి చేరుకున్నాడు సాంబశివం.

ఖండఖండాలుగా నరకబడివున్నారు, సుశీల, శేఖరం... సుశీల వస్తువులన్నీ రక్త సిక్తాలయ్యాయి. వీటి మధ్య ఎఱ్ఱగా భయంకరంగా మెరుస్తోంది, తలిదండ్రుల మధ్య ఉన్న సుశీల ఫోటో.

ఆదృశ్యం చూడలేక స్మృతి తప్పి పడిపోయింది లలిత. ఆ ఫోటో చేతిలోకి తీసుకుని పిచ్చి చూపులు చూశాడు సాంబశివం. ఆ దంపతులను ఎలాగో ఇంటికి చేర్చారు.

స్మృతి రాగానే లలిత మొట్టమొదట అడిగిన ప్రశ్న...."నిజం చెప్పు సుశీల ఆ మధ్య రోజూ ఇంటికి ఆలస్యంగా వచ్చేది. సీతో పార్టీలో ఉన్నానని అనేది. నువ్వూ 'అవును, అనేవాడివి... నిజమేనా ?"

వల్లమాలిన కసితో రగులుకుపోతున్న లలితకు సాంబశివాన్ని మన్నించాలని కూడా అనిపించలేదు.

సాంబశివం తలవంచుకున్నాడు.

"దుర్మార్గుడా ! నామీద కసి తీర్చుకోవాలని అనుకున్నావే కాని దానివల్ల కలిగే ఫలితాలను ఊహించలేక పోయావు... నన్ను ఏడిపించి ఆనందించాలనుకున్నావు. ఆనందించు....బాగా ఆనందించు. నీ ఆనందాన్ని చూసి నేనూ ఆనందిస్తాను..."

విరగబడి నవ్వింది లలిత...అలా నవ్వి నవ్వి మళ్ళీ స్మృతి తప్పి పడిపోయింది.

(సశేషం)

# ఆహార కల్తీ నిరోధక చట్టం

"బియ్యంలో రాళ్లు. పప్పుల్లో పుచ్చు జొన్నలు. జొన్నల్లో మట్టిగడ్డలు. పాలల్లో నీళ్లు. ఎక్కడ చూసినా కల్తీయేనా? ఏంకాయిక మొచ్చి పడింవరా?" అంటోంది మా బామ్మ గుమ్మంలో అడుగు పెట్టేప్పటికి. "ఏమిటమ్మా కాయికమేమిటి? ఈ మాట అప్పుడప్పుడు వింటూనే ఉన్నాంగాని దాని అర్థమేమిటో చెప్ప" మన్నాం మా అన్నయ్యా నేనూ.

"కాయికమంటేనా! కాయమంటే శరీరం. ఈ వ్యాపారం చేసేవాళ్ల శరీరాన్ని, ఇంద్రియ ధర్మాల్ని మాత్రమే లక్ష్యంగా పెట్టుకొని, మనసునీ, బుద్ధినీ వదిలివేసి తమ వ్యాపారాలు చేస్తున్నారని అర్థం" అంది.

మాటకు అర్థమయితే తెలిసిందిగాని ఈ మనసు, బుద్ధి భావాలు మాకెక్కలేదు. ఆవిడ పూర్వకాలపు యాస మళ్లీ విందామని అదేమిటో ఇంకా కాస్త వివరించమన్నాం—ఆవిడ అందుకొంది

"మారోజుల్లో కూడా వ్యాపారాలు చేసేవాళ్ళు ఎంతో మంది లేకపోలేదురా. వ్యాపారాలు చేసే వాళ్లున్నారు. చదువులు చెప్పే వాళ్లున్నారు. యుద్ధాలు చేసేవాళ్లున్నారు నౌకరీలు చేసే వాళ్లున్నారు. ఎవళ్ల వృత్తులు వాళ్లు పాటించే వాళ్లే కాని, అందరికీ ఒకానొక ధర్మం అనేది ఆధారంగా ఉంటుండేది. అదిప్పుడు లేదు. ఈ రోజుల్లో ధర్మం సంగతి వదలివట్టిగా యీ భౌతికశరీరం కోసం అది కావాలి ఇది కావాలి అనుకొని అబద్ధపు బ్రతుకు బతికి డబ్బు మూటకట్టటమే ప్రధానంగా జనం-వ్యాపారస్థులూ-కనపడుతున్నారు.

"ధర్మం అనేది ఒక చెట్టు. దాని మొదట్లో నీళ్లు పోస్తే మొత్తం చెట్టంతా నవనవలాడుతూ శోభాయమానంగా వృద్ధి పొందుతుంది. నిన్న నీ కొడుకు చూడు ఏం చేశాడో-కొత్తగా పెట్టిన బంతిమొక్క వాడిందని ఆకుఆకుకూ నీళ్ల తడి అంటించటం మొదలు పెట్టాడు. చెట్టుకు మొదట్లో నీళ్లు పోస్తే చాలునని వాడికి తెలీదుగా మరి! అలాగే ధర్మం అనేదాన్ని పాటించినట్లయితే తన మనోబుద్ధులకూ శరీరానికీకూడా తగిన సౌష్టవం కలుగుతుందనే సంగతి తెలీక, ఇప్పటి వ్యాపారులు 'తమ కాయానికి' మాత్రమే ప్రాధాన్యమిచ్చి తాము చేసే ప్రతి పనిని 'కాయికం' చేస్తున్నారయ్యా" అంది.

అప్పటికి బుర్ర పనిచేయటం ఆరంభించింది నాకు. నిజమే! ధర్మం అనే దాన్ని ఈ చిన్నపిల్లల్లా ప్రవర్తించే వారికి తెలియ చెప్పాలి. దాన్ని మాటల్లో చెప్పితే. చాలునా? శాసనాలు మాటల్లో చెపుతూనే ఉంటవి గదా-'ఇలా చేస్తే ఈ శాస్తి అని' కాని దానివల్ల తప్పు పని యొక్క విలువ ఆశిక్ష మాత్రమే అనీ, పరిమిత మేననీ అంత వరకే తెలుస్తుందే! తప్పు చేయటమనేది ధర్మహాని అనీ. ధర్మం అనేది సమాజపు మనుగడకు ఆధారమనీ అందుచేత తప్పుచేస్తే సమాజంతో సహా తన బ్రతుకు బండలయిపోయే అవకాశం కలుగుతోందనే తెలివిడి ప్రజలకు కలగాలి. అదీ ధర్మం తెలియటమంటే. ఎలా!

ఈ సంగతులు పసితనం నుంచీ తల్లి నుంచీ తండ్రి నుంచీ సంప్రదాయం నుంచీ నేర్చుకోవాలి తల్లీ తండ్రి చనిపోతే దేశ సంస్కృతి చరిత్ర పఠించి — విచారణ చేసి తెలుసుకోవాలి.

తెలుసుకోవటం కన్ను ముక్కు చెవి నాలుక చర్మం ద్వారా మాత్రమే కాదు. మనసుతో చాలా తెలుసుకోగలం. ఆలోచించి వెనకటి స్మృతులతో కలిపిచర్చించి నిర్ణయించేశక్తి మన బుద్ధికి ఉంది క్షణక్షణం వ్యక్తి పాటించాల్సిన సూత్రమిది.

ఒక శాసనాన్ని చదివినా తెలుసుకొన్నా ఆ విధంగానే తెలుసు కోవాలి. చదివేటప్పుడు మనసుకు వెనుక ఈ సూత్రం మసలుతుండాలి. శాసనం అంతర్యం అర్థమయేది అప్పుడే

—శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

అలాగాక శాసనంలోని మాటలే చెప్ప, కోర్టుల్లో అంతకంటె అక్కర్లేదు అంటే దేశమంటే మట్టి అని మాత్రమే అర్థం చేసుకున్నట్లు.

శాసనంలో విషయాలు తెలుసుకొంటే ఈ ధర్మబుద్ధి వస్తు తః కలవారికి తమ సమాజ ఉద్ధరణకయి ఏ కర్తవ్యం తాము చేయాలి అనేది అర్థమవుతుంది. ఈ ధర్మబుద్ధిలేని వాళ్లకు ఆ శిక్ష నెలా తప్పించుకోవాలనే ఆలోచన మాత్రమే నిలుస్తుంది మొదటి స్థితిని పొందటంవల్ల సమాజానికీ తనకూ కూడా వ్యక్తి క్షణ క్షణాన శోభ కలిగించటానికి ఆధారాన్ని పొదుప కలిగిన వాడవుతాడు. రెండవ మనఃస్థితి కలిగినవాడు తన పతనం, తనవారి పతనం తన దేశపతనం ఆవైపు దోవ తీసిన వాడవుతాడు. తన పతనమే ముందు కలిగి జైళ్ళల్లో పడి నాశనం అయిపోతే తన వారికి కొంత బాధకలిగి వూరుకొంటుంది. దేశందాకా ఈ అపచారం పోదుగనక. కాని తను తప్పుచేసి తప్పించుకు పోయిన క్షణాన

దేశం దెబ్బతిని సమాజం మొత్తానికి అందులో తనకూ మనకూ కూడా నాశనం కలుగుతుంది. దేశ కంటకుడవ్వదలచాడు. అతడు ముల్లువంటివాడని ప్రజలు గ్రహించి, పెరికి పారేస్తారు.

ఇప్పుడు చెప్పబోయేదేమిటంటే– అందాకా ఆగవద్దు అని. ఒకరు శాసనానికి వ్యతిరేకంగా నడుస్తుంటే అతడిని ఇప్పుడే పట్టివెయ్యాలి. దేశనష్టం, వ్యక్తినష్టం కంటె ఘోరమైనది కదా! ఈ పనికోసమే ఎక్కడికక్కడ ఒకానొక శాసనం తయారు చేసి అంకుశం పెట్టడం అనేది కలుగుతుంది. ఎప్పటికప్పుడు ధర్మ రక్షను మనసులో పెట్టుకొని ధర్మనిరతిని నిరంతరం పెంపొందించుకోవాలి.

## ఆహార కల్తీ నిరోధక చట్టం

1954 సెప్టెంబరు 29వ తేదీన ఆహార కల్తీ నిరోధక చట్టమని ఒక చట్టం పార్లమెంటులో చేశారు. అది 1 వ జూను, 1955 న అమలులోకి వచ్చింది. దానిని 1964 లో 1971లో మళ్లీ మళ్లీ సవరణ చేశారు. తిరిగి 1976 లో పటిష్టం చేస్తూ విస్తృతంగా సవరించారు. ఆహార వస్తువులలోని కల్తీని అరికట్టాలని ఈ చట్టం ఆశయం.

## ప్రధాన నిబంధనలు

ఈ చట్టంలో పరమమైన నిబంధనలు మూడున్నాయి. అవేమిటంటే ఆహారవస్తువులు ఎలాపడితే అలా ఎవరుగాని అమ్మటం తయారుచేయటం కూడదనే నిషేధం. ఆహారం శుద్ధమైనదైతేనే అమ్మకం చెయ్యాలి. అపమిశ్రితమయిన ఆహారం కల్తీ ఆహారమన్నమాట. అలాంటి అపమిశ్రితమైన ఆహారం ఎవరికివారు తింటే తినవచ్చుగాని ఇతర్లకు అమ్మరాదు. పైగా అమ్మకానికిగాను తయారు చేయకూడదని శాసనం. అంతేకాదు–ఒక కోవకు చెందిన వస్తువును ఒక డబ్బాలో పెట్టి ఆ డబ్బా మీద ఇంకో కోవకు చెందిన ముద్రవేసి అమ్మడానికి వీలులేదు. అలాంటి పని "తగని ముద్ర"వేసి అమ్మిన నేరమవుతుంది

1976లో చేసిన సవరణలో ఈ సందర్భంలో ఒక ముఖ్యమైన విషయం చేర్చారు. దాని ప్రకారం ఈ అపమిశ్ర ఆహారంగాని, "తగని ముద్రవేసిన" ఆహార పదార్థంగాని ఒకచోట నిలవ చేస్తే యథాతథంగా అమ్మడానికి కాకపోయినా దానితో ఒకానొక ఆహార వస్తువును తయారుచేసి అమ్మాలని ఉంచినట్లయితే అది కూడా నేరము క్రిందకే వస్తుంది. ఎందుకని అంటే గట్టిగా అలా నిలవ చేయటంలో దానిని ఉపయోగించి అపమిశ్ర ఆహారాన్ని తయారుచేసి అమ్మే దురుద్దేశ్యమే అతడి ప్రధాన లక్ష్యం గదా. ఇది చాలు అతడిని నేరస్థునిగా నిరూపించడానికి అని అర్థం. ఇంకా లైసెన్సు పొందాల్సిన వాటికి పొందకపోతే, ప్రభుత్వంలోని ఆహార ఆరోగ్య అధికారి ఫలాని వస్తువులు అమ్మడానికి వీల్లేదన్నప్పుడు అవి అమ్మితే కూడా నేరమే.

పైన చెప్పినలాటి అపమిశ్ర ఆహారంగాని తగని ముద్రను కలిగిన ఆహారంగాని ఇండియాలోకి బయటనుంచి తెప్పించుకొనటం కూడా 5వ సెక్షను ద్వారా నిషేధింపబడింది. అలా ఎవరైనా అలాటి పదార్థాలు తెప్పించుకొనేటట్లయితే కస్టమ్సు శాఖలోని అధికారులు ఆ వస్తువులను అక్కడే నిలుపుదల చేసి కేంద్ర ఆహార పరిశోధనా సంచాలకునికి పరిశీలన కోసం అందులో అనుమానంగా ఉన్న వస్తువుల్ని పంపవచ్చు.

రెండవది: ఆహార పదార్థం తయారుచేసేవాడు అమ్మేవాడు కమీషన్ యేజెంటు డీలరు ఎవరుగాని అమ్మేటప్పుడు వ్రాతపూర్వకంగా ఒకానొక "వారంటీ" ఇవ్వాలి. అది నియమాల క్రింద విహితమైన ప్రకారం ఉండాలి. దానిలో అమ్మిన పదార్థం యొక్క స్వభావం దాని గుణం కొన్నవాడికి తెలిపే విధంగా వ్రాసి ఉండాలి. అమ్మకం విషయంలో అతడిచ్చిన బిల్లు, క్యాషుమెమో లేదా ఇన్వాయిసు కొన్నవాడికి ఇచ్చిన ఒక వారంటీగానే భావించబడాలి

మూడవది: ఆహార వస్తువులు అమ్మినవాడు, ఆహార పరిశీలనాధికారి కోరినప్పుడు తనకు ఎవరి వద్దనుంచి ఆ వస్తువు వచ్చిందో ఎలా వచ్చిందో తెలియజేయాలి. ఈ మూడు విషయాలు చట్టంలో ప్రధాన ఆశయాలకు అనుగుణంగా అమలుకోసం శాసించారు.

ఇంతకూ ఏ ఆహారం శుద్ధమైంది? ఎలా వుంటే కాదు? అనే సంగతి తెమిల్చి చెప్పగలిగినవారు కావాల్సి వచ్చారు. ఆహార శుద్ధతకు ప్రమాణాలు నిర్ణయించాల్సిన అవసరం కలిగింది. దానికిగాను ఒక కేంద్రీయ కమిటీని యేర్పాటు చేశారు. చాల పెద్ద పెద్ద అధికారులు ఇందులో సభ్యులు. ఆహారనిపుణులు, డాక్టర్లు, వైజ్ఞానికులు ఎంతో మంది ఉంటారు. ఈ కమిటీవారు కేంద్ర ప్రభుత్వానికి యీ చట్టం విషయాల్లో సలహాలిస్తారు. 1976 లో చేసిన సవరణ ద్వారా కేంద్ర ప్రభుత్వం ఈ కమిటీకి ఒక కార్యదర్శిని నియామకం చేసి, తగిన సిబ్బందినిచ్చి, కొన్ని అధికారాలను కూడా ఇవ్వవచ్చునని ఏర్పాటు జరిగింది. కేంద్రీయ ఆహార లేబొరేటరీలను ప్రభుత్వం స్థాపించడానికి అవకాశం కూడా కలిగింది. వీరు ఇచ్చిన సలహాలపై ఆధారపడే ప్రభుత్వం చేసే నియమాలు, ఉత్తరువులు ఉంటయి.

## అధికారులు

పబ్లిక్ ఎనలిస్టులు అనే అధికారులను కూడా ప్రభుత్వం నియమిస్తుంది. ఒక్కొక్క ఆహార పదార్థ విషయానికి ఒక్కొక్క ఎనలిస్టును కూడ నియామకం చేయడానికి ప్రభుత్వానికి వీలుంది. ఏ పదార్థమైనా కల్తీ పదార్థమా లేదా అనే విషయం ఈయన వైజ్ఞానికంగా పరిశీలించి విశదీకరించగలడు.

ఇంకా ఆహార పరిశీలనాధికారులను కూడా ప్రభుత్వం నియామకం చేస్తుంది. కేంద్ర ప్రభుత్వమే కాదు–రాష్ట్ర ప్రభుత్వం కూడ ఈ పరిశీలకాధికారులను స్థానిక ప్రాంతాలకు నియమించవచ్చు. ఈ చట్ట ఆశయాలను కొనసాగించటంలో వీరి పాత్ర యెంతో వుంది.

కాగా పరిశీలనాధికారిగా ఏ వ్యక్తిని అయినా నియమించవచ్చు. అయితే అందుకు కావలసిన కొన్ని యోగ్యతలను అతడు కలిగి ఉండాలి. డాక్టర్లనేగాక, శానిటరీ ఇన్‌స్పెక్టర్లను కొంతమందిని ఈ అధికార్లుగా వేశారుకూడా.

## ఆహార పరిశీలనాధికారుల అధికారాలు

ఈ అధికారులు ఎక్కడెక్కడ అపమిశ్రిత ఆహారం అమ్ముతున్నా వెంటనే స్థానిక ఆరోగ్య అధికారికి గాని ఆహార ఆరోగ్య అధికారికిగాని చెప్పి అమ్మకం నిషేధింపవచ్చు. ఈ తక్షణ చర్యకు వీలుగా 1976 లో సవరణ జరిగింది.

ఈ అధికారి ఆహార వస్తువులను అమ్మేవాడి దగ్గర్నుంచి గాని అప్పుడే కొనుక్కొని వెళుతున్నవాడి దగ్గర్నుంచి గాని కొంటూ కొంటూ ఉన్న స్థితిలో గాని ఆ ఆహార పదార్థాన్ని గ్రహించి అందులో నమూనాకు కొంత పదార్థాన్ని తీసుకొని పబ్లిక్ ఎనలిస్టు దగ్గరకు పరిశీలనకు పంపవచ్చు. ఇదంతా ఎందుకంటే ఆ ఆహార పదార్థం ఒకవేళ కల్తీది అయినట్లయితే వెంటనే దాని విషయమై చర్య తీసుకొనే వీలు కలుగజేయడానికి.

అమ్ముతూ వున్న చోటే కాదు అమ్మకానికి గాను ఎక్కడయినా ఆహారాన్ని నిలువచేసి వుంచినట్లయితే ఆ చోటికి, లేకపోతే దాన్ని తయారుచేసే చోటికైనా సరే-వెళ్లి, ఆహారంలో వుపయోగింపబోయే ఆహార పదార్థాలలోనుంచి కూడా శాంపిలు తీసుకొనే అధికారం ఈ ఆహార పరిశీలనాధికారికి ఉంది. కాని వ్యవసాయ మూలకంగా యథాతథంగా వచ్చిన ఆహార పదార్థాలను శాంపిల్‌గా తీయవలసిన పనిలేదు. తీయరాదు కూడా అంతేకాదు వూరికే వచ్చి, శాంపిలు అని చెప్పి పదార్థాలను ఎత్తుకుపోవటం కాదు. అలా తీసుకొన్న పదార్థము యొక్క విలువను మామూలు రేటు చొప్పున లెక్కగట్టి ఎవరిదగ్గరనుంచి అతడు తీసికొన్నాడో అతడికి చెల్లింపవలసి వుంది.

ఈ విధంగా శాంపిలు తీసుకొనేదెప్పుడంటే కల్తీ ఆ ఆహారంలో ఉన్నదా లేదా అనే సంగతి ఇతమిత్థమని తెలియనప్పుడు. అలాగాక ఫలాని ఆహార పదార్థము కల్తీదేను అనిగాని లేకపోతే అది ఒక అపమిశ్రమమేను - దానిని ఆహారంతో కలపటానికే తేబడింది అనిగాని తెలిసిన సందర్భంలో ఆహార పరిశీలనాధికారి ఆ పదార్థం మొత్తాన్నే పట్టుకోవచ్చు. అలా పట్టుకొన్న పదార్థం అక్కడనుంచి తీసుకుపోయి ఎక్కడనో జాగ్రత్త చెయ్యవచ్చు. లేదా తగిన హామీ పుచ్చుకొని దాని యజమాని దగ్గరనే సీలువేసి ఉంచవచ్చు.

ఒకవేళ పరిశీలనకుగాను ఏదైనా పెట్టెగాని, ప్యాకింగుగాని తెరవనీయనని యజమాని అన్నట్లయితే కూడా పరిశీలనాధికారి బలవంతంగా అలాంటి పనిచేయించాల్సిన అవసరం ఉందని వ్రాత పూర్వకంగా రికార్డుచేసి అలా పగలకొట్టించి శాంపిలు తీసికోవచ్చు. ఈ సందర్భంలో నేర ప్రక్రియ స్మృతిలో ఉన్న సూత్రాలనే ఈయన అనుసరించి, ప్రవేశించటం పగలకొట్టించటం వగైరా పనులు చేయాల్సి వుంటుంది.

ఆహార పదార్థాలను తయారు చేసేవారు, పంపిణీ సరఫరా చేసేవారు. ఈ సంబంధమైన క్రయవిక్రయాల్లో వ్యవహరించే డీలరులు ఎవరుగాని అపమిశ్రమమైన ఆహారపదార్థాన్ని తెచ్చి తమ పరిసరాల్లో ఉంచుకొని అది ఎందుకు ఎలా ఎప్పుడు తెచ్చాడో చెప్పలేకపోయినట్లయితే దాని శాంపిలు తీసికొనటమే కాకుండా అక్కడున్న అకౌంటు పుస్తకాలు, ఇంకా తను చేయబోయే ఫిర్యాదుకు కావలసిన ఇతర కాగితాలు ఉన్నట్లయితే వాటిని పట్టుకొని ఆహార పరిశీలనాధికారి తీసుకుపోవచ్చు. ఐతే అలా తీసికొనే ముందు తన పై అధికారియొక్క ఆమోదాన్ని పొందిఉండాలి.

ఈ అధికారపు చలాయింపు ఒకప్పుడు చాలా దారుణమైందిగా పరిణమించవచ్చు. సలక్షణంగా అమ్ముకొంటున్న దుకాణంలోకి వచ్చి "నీ దగ్గరున్న వస్తువులకు సరియైన ఎకౌంటు చెప్పలేకపోయినావని" "నా ఎకౌంట్లు నా వస్తువులు పట్టుకుపోతే మరి దానికి పరిష్కారమేమిటనేది" ధర్మయుక్తమైన ప్రశ్నలు. లెక్కలు తీసికొనిపోతే, రేపటినుంచి వ్యాపారం నడిపేదెలా? ఈ ప్రశ్నలకు సమాధానంగా 1976లో (7ఏ) (7బి) అనే ఉప పరిచ్ఛేదాలు 10వ పరిచ్ఛేదంలో చేర్చారు. వాటిక్రింద ఆ అధికారి పుస్తకాలు తీసుకొన్న ముప్పయి రోజులలోపల ఆ లెక్క పుస్తకాలను తిరిగి ఇచ్చివేయాలి. కాని వాటి ప్రతులు తనదగ్గర ఉంచుకొని మరీ ఇవ్వాలి. ఆ ప్రతులు కూడ లెక్క పుస్తకాలను ఎవరి దగ్గరనుంచి తీసికొన్నాడో అతడు సర్టిఫైచేసిన ప్రతులై ఉండాలి. ఒకవేళ అతడు సర్టిఫై చేయడానికి నిరాకరిస్తే కోర్టులో ఫిర్యాదు చేసిన తరువాత కోర్టువారు సర్టిఫై చేసిన కాపీలు ఉంచుకొని, లెక్కల పుస్తకాలను ఇచ్చివెయ్యాలి.

కాగా అలా పట్టుకొన్న అపమిశ్రమ పదార్థం ఆహారాన్ని తయారుచేయడానికి తీసుకొని రానేలేదనీ-మరెందుకో ఫలానదుకు తెచ్చిపెట్టుకొన్నామని అనేటట్లయితే ఆ సంగతి రుజువు చేసుకొనే బాధ్యత ఆ దుకాణదారుడి మీదనే ఉంటుంది.

అయితే ఆహార పరిశీలనాధికారిగా నియమింపబడిన యే వ్యక్తిగాని అనుమానానికి ఆస్పదం లేకుండానే అమ్మేవాడినెవడినో సాధిద్దామనే దురుద్దేశంతో ఆహారాన్ని లేదా అపమిశ్రమాన్ని పట్టుకొని అనుచితంగా ప్రవర్తించినట్లయితే అతడు నూరు రూపాయలకు తక్కువ కానట్టిన్ని వేయి రూపాయల వరకూ పోగల జరిమానాకు పాత్రుడవుతాడు.

దేశ సేవచేసే వ్యక్తులెవరైనా ఉంటే ఇలాంటి కల్తీ ఆహారపు కేసులు పట్టించే ఉద్దేశముంటే ఈ ఆహార పరిశీలనాధికారుల ద్వారా నేరస్థులను పట్టించవచ్చు. అంతే కాదు ప్రభుత్వం అంగీకరించేటట్లయితే తానే పరిశీలనాధికారిగా నియమింపబడవచ్చు. అలాటివారు లేకపోవటాన ఆ అధికారం ప్రస్తుతం ప్రభుత్వ ఉద్యోగులకు మాత్రమే ఇవ్వబడుతోంది. ఇతరులకు అలాటి అధికారము ఇచ్చినట్లయితే జీతభత్యములకుకాదు గాని- అధికారములను చెలాయించే విషయంలో మాత్రం ఒకానొక పబ్లికు ఉద్యోగిగానే అతడు పరిగణింపబడుతాడు. దేశ సేవగా

చేసిన ఈ శ్రేయోమార్గగామి తాను కావటమే అతడికి పతాకవంటి లాభం! ప్రభుత్వం ఒకవేళ ఇస్తే వచ్చే చిట్టి చిట్టి చెల్లింపులకేం గాక!

## కల్తీ ఆహార విషయం పట్టుకోవలసిన తీరు

ఆహార పరిశీలకాధికారము కలిగిన వ్యక్తి ఆహార పదార్థం యొక్క శాంపిల్‌ను తీసికొనేటప్పుడు అది ఎవరిదగ్గర నుంచి తీసుకొన్నాడో అతగికి ఆ పదార్థపు శాంపిల్‌ను తాను పబ్లిక్ ఎనలిస్టు వద్దకు పంపబోతున్నట్లు ఒక నోటీసును వ్రాతపూర్వకంగా ఇవ్వాలి.

శాంపిల్‌ను మూడు భాగాలుగాచేసి ఆ మూడింటినీ వేరు వేరుగా సీళ్ళువేసి, అలా వేసినట్లు సాక్ష్యానికై ఎవరిదగ్గరనుంచి ఆ శాంపిల్ తీసుకొన్నాడో అతడి సంతకం లేదా గుర్తు కూడా వేయించాలి. అలా అతడు సంతకం చేయటానికి ఇష్టపడకపోతే ఎవరైనా ఒకరిద్దరు సాక్షులచేత సంతకములు తీసుకుని సీళ్ళు వేయించవలసి ఉంటుంది.

అలా చేసిన భాగాల్లో ఒకటి పబ్లిక్ ఎనలిస్టుకు, మిగతా రెండున్నూ స్థానిక ఆరోగ్య అధికారికిన్నీ పంపాలి. పబ్లిక్ ఎనలిస్టు దగ్గరనుంచి దాని విషయమైన నివేదిక వచ్చిన తరువాత వీలయినంత వెంటనే— అయితే ఏడు రోజులు దాటకుండానే— మెజిస్ట్రేటు వద్ద కేసును దాఖలుచేసి, పట్టుకొన్న అపమిశ్రమము లేదా ఆహారమును ఆయన ఎదుట పెట్టాలి. అప్పుడు మెజిస్ట్రేటు విచారణ జరిపి తగిన ఉత్తరువులను శిక్షలతోబాటు ఇవ్వగలడు. అపమిశ్రమమని నిశ్చయింపబడిన పదార్థం ప్రభుత్వానికి దత్తం చేయవచ్చు లేదా దుకాణదారునికిచ్చినదానిని బాగుచేసి, దాని తత్త్వమును అభివృద్ధిచేసి ఉపయోగించవలసినదని ఉత్తరువు నీయవచ్చు.

ఒకవేళ అసలు ఆ వస్తువు అపమిశ్రితం కాలేదని అభిప్రాయ పడినట్లయితే ఆ అమ్మకందారుకు ఆ వసువు వాపసు ఇవ్వటమేగాక అతడికి కలిగిన నష్టమునకు మించకుండా నష్టపరిహార మివ్వవలసిందని కూడా ప్రభుత్వానికి ఉత్తరువునీయవచ్చు.




మామూలు కొనుగోలుదారు కూడా పబ్లిక్ ఎనలిస్టుకు తాను కొన్న ఆహార పదార్థం పరిశీలనకు పంపవచ్చు.

ఏ వ్యక్తి అయినా సరే ఆహారం కొని అది అపమిశ్రితమైనదైతే ఆ సంగతి ధృవపరచటానికి అప్పటికప్పుడు అమ్మినవాని ఎదుట శాంపిల్సు తీసుకొని పబ్లిక్ ఎనలిస్టుకు పరిశీలనకు పంపవచ్చు. అయితే అందుకుగాను కొంత ఫీజు చెల్లించవలసి వుంటుంది. పబ్లిక్ ఎనలిస్టు ఇచ్చిన నివేదికమీద మేజిస్ట్రేటు కేసు దాఖలయి చివరకు ఆ ఆహార పదార్థము అపమిశ్రితమయిందని నిర్ణయింపబడినట్లయితే ఆ కొనుగోలుదారు కట్టిన ఫీజును తిరిగి ఆతడికి వాపసు ఇవ్వబడవలెనని 12వ పరిచ్ఛేదం చెపుతున్నది.

(సశేషం)



సీరియల్:



# స్వర్ణయోగి

పులిచెర్ల సాంబశివరావు

—అష్టమ యోగము—

నరసాంబ వెళ్ళిపోయిన కొద్దినిమిషాలకే పెద్దన చామిసెట్టితో కలిసి మూగచింతపల్లి మార్గం పట్టాడు. గాఢాంధకారం ఆవరించి ఉన్న ఆ రాత్రి చుక్కలే వాళ్లకు మార్గం చూపుతున్నాయి:

వాళ్ళలో ఆవేశం రగులుకొంది. వాయు వేగంతో మూగచింతపల్లెను సమీపిస్తున్నారు. ఇంతలో మబ్బులుగ్రమ్మాయి. చిమ్మచీకటిలో దిక్కూ తెన్నూ తెలీక వాళ్లు అయోమయావస్థలో పడ్డారు. చిటపట చినుకులు మొదలయ్యాయి. ఒక ప్రక్కనుండి హోరు గాలి! చలికి నరాలు జివ్వున లాగుతున్నాయి. వాన పెద్దదయింది. ఫెళఫెళార్భటులతో ఆకాశం ముక్కలై నిప్పులు కక్కుతూంది. తటిల్లతల వెలుగులు వారికి భగవత్ప్రసాదితాలై దివ్వటీలయ్యాయి. శంపాలతల కాంతి పుంజాలు ఆ మిత్రులకు గమ్యస్థానాన్ని చూపుతున్నాయి

మెరుపు మెరిసింది.

ఆ త్రుటి కాలపు వెలుగులో ఏవో ఆకారాలు కనబడ్డాయి. సమీపంలో ఎవరో అశ్వారూఢులై వేరొక దిక్కుగా పోతున్నారు.

మెరుపు మాయమయింది. ఏమీ కనబడటం లేదు. పెద్దన పెద్దగా కేక వేశాడు.

"ఎవరు వారు? దయతో మాకు మూగచింతపల్లి మార్గం చూపుతారా?"

ఏమీ సమాధానం రాలేదు.

ధణధణా అని మబ్బులు విచ్చుకొని విద్యుత్ కాంతిని విరజిమ్మాయి.

పెద్దన కన్నులు పెద్దవి చేసుకొని పరికించాడు. ఎవరూ కనబడలేదు.

"చామిసెట్టీ? ఇపుడెవరో మనుషులు ఇటుగా పోయారు గదూ...నేను పొరబడ్డానా?"

"నేనూ చూశా? వాళ్ళలో ముందున్నవాడు తురగా రాముని లాగా ఉన్నాడే!"

ఆ పేరువినగానే పెద్దనకు ఆవేశం ఎక్కువైంది. అశ్వాన్ని దౌడు తీయించాడు. ఇద్దరూ ఆ కటిక చీకట్లో దారి చూసుకుంటూ మూగచింతపల్లె చేరారు. మొదటి ఇంటిముందు ఆగారు.

పెద్దన తలుపు తట్టాడు. ఎవరూ పలకలేదు. మళ్లా పెదన శబ్దం చేశాడు. ఆ యింటి దాసి వచ్చి తలుపు తీసింది.

"ఎవరు మీరు?" అని అడగబోయింది కానీ ఆమె నోరు విప్పేలోపలే ఆ యిద్దరూ లోపలకు జొరబడ్డారు.

"అయ్యయ్యో! ఎవరయ్యా మీరు? దొంగల్లా ఇలా ఇంట్లో జొరబడ్డారేం?"

"అవును మేం దొంగలమే! మీ దొర వేమారెడ్డికోసం వచ్చాం!" చామిసెట్టి సమాధానం ఇచ్చారు.

"వేమారెడ్డిగారా! ఆయన పోయారు!"

ఆ సమాధానం విని మిత్రులిద్దరూ కలవరపడ్డారు. చామిసెట్టి సర్రున లోపలికిపోయి నిద్రిస్తున్న నాగుల్ని జుట్టుపట్టుకొని తెచ్చి పెద్దన ముందుంచాడు. నాగులు సంగతి కనిపెట్టింది.

"ఓసీ! ఎక్కడ మా వేమారెడ్డి? నీ టక్కులు మా దగ్గర కాదు! నిజం చెప్పు!" అంటూ దాని కంఠానికి తన చురకత్తిని ఆనించాడు. కత్తిని చూడగానే దాని కలవరం అధికమయింది.

"వేమారెడ్డిగారీ ఉదయమే ఇక్కడనుండి వెళ్లిపోయారు! అంతకు తప్ప నాకేం తెలియదు!" అని దీనంగా పల్కింది.

"నాగూ! నీ కల్లబొల్లి కబుర్లు కట్టిపెట్టు. అబద్ధం చెప్పావో అరమరికలు లేక నీ అసువులు తీస్తా! ప్రాణాలపై ఆశ వుంటే సత్యం పలుకు!"

"సత్యం స్వామీ ! సత్యం ! వారి మరణానికీ నాకూ సంబంధమే లేదు. నేను నిర్దోషిని. దయతో నను విడిచిపెట్టండి !" అని దుఃఖావేశంలో అది అసలు సంగతి బయటపెట్టింది. చామిసెట్టి సంగతి వెంటనే గ్రహించాడు.

సౌమ్యంగా ఇలా అన్నాడు:

"నాగులూ ! నువ్వు మంచిదానివి. లేకపోతే సహృదయుడైన మా ప్రాణమిత్రుడు వేమారెడ్డి నీతో స్నేహం చేయడు ! నిజం చెప్పు !"

"నాకేం తెలీదంటే నమ్మరేం !"

"నాగులూ ! ఇటు చూడు ! నా కంఠాభరణం వైపు !"

చామిసెట్టి కంఠాభరణంలో వింత వజ్రాలు కాంతిమంతంగా కన్నుల్ని జిగేల్ మనిపిస్తున్నాయి.

"నాగులూ ! ఈ వజ్రాల విలువ నీవు ఊహింప గలవా? ఈ ఆభరణంతో కొండవీటినే కొనేయొచ్చు !"

నాగులు నేత్రాలు విస్ఫారితాలయ్యాయి. ఆ ఆభరణం పై దానికి ఆశపుట్టింది.

"నాగులూ ! జరిగిందంతా చెప్పు !"

"తురగా రామనగారు వచ్చారు....!"

"వాడిక్కడకు వచ్చాడా?" ఉద్రేకంతో పెద్దన నాగులుపై బడబోయాడు. చామిసెట్టి కనుసైగతో వారించాడు.

"ఆ ! తురగా రామన ఇక్కడకు వచ్చి ఏం చేశాడు !" చామిసెట్టి నాగుల్ని ప్రోత్సహించాడు.

"నా కొక పొట్లం ఇచ్చారు !"

"పొట్లమా !" పెద్దన ఆశ్చర్యపడ్డాడు.

"ఆ పొట్లంలో ఉన్న పొడిని వేమారెడ్డి గారి చేత తినిపించాలని ఆయన కోరారు !"

"నువ్వలాచేశావా?" మిత్రులిద్దరూ ఆదుర్దాతో ప్రశ్నించారు. నాగుల ప్రశ్నకు జవాబు చెప్పక పోవటంతో చామిసెట్టికి, కోపము వచ్చినప్పటికీ అణచుకొని సానునయంగా ప్రశ్నించాడు.

"తరవాత ...!"

"తరవాత ... మూర్ఛిల్లిన వేమారెడ్డిగారిని తురగారామన మంత్రి తన అనుచరులతో కూడి అశ్వాలమీద తీసుకొని పోయారు. ఇంతకు తప్ప నాకేం తెలియదు ! నమ్మండి !"

"ఓసీ ! విశ్వాస ఘాతకురాలా ! నీవే సర్వస్వమని నీయింట చేరిని ప్రాణమిత్రుని ప్రాణం తీసిన నిన్నేం చేసినా పాపం లేదు!" అని పెద్దన కత్తిని ఎత్తాడు. చామిసెట్టి వారించాడు !

"మిత్రమా ! వేశ్యమాటలను నమ్మిన మన మిత్రుడుండగా దీన్ని అని ఏంలాభం ? ఆడదాన్ని చంపటం అధర్మం !"

"చామీ ! నన్ను వదులు ! ఈ నీచ పిశాచి నెత్తురు రుచి చూడందే నా చురకత్తికి సార్థకత లేదు !" అని పెద్దన్న పెనుగులాడాడు.

"మిత్రమా ! ఆవేశపడకు ! దీనినుండి ఇంకాకొన్ని రహస్యాలు తెలుసుకోవాలి !" అని చిన్నగా చామిసెట్టి పలికాడు. పెద్దన కోపాన్నంతా గుండెలో దాచుకొని నిలువ బడ్డాడు.

"నాగులూ! తురగా రాముడు ఎంత సేపయింది ఇక్కడ నుండి వెళ్లి పోయి ?"

"అర్ధరాత్రి కొంత గడియముందుగా !"

"అయితే ... వాడు వేమారెడ్డిని తీసుకొని ఎక్కడకు పోయి వుంటాడు ?"

"ఏమో ... నాకు తెలియదు. వారి సంభాషణను బట్టి ఆయనను ఎక్కడో అడవిలో పారవేస్తారని అనుకుంటున్నా !"

మిత్రులిద్దరూ అక్కడనుండి వెలికి వచ్చారు. నాగులు కూడా వారి వెంబడి వచ్చింది. వర్షం నిష్కళంకంతో కుమ్మరించినట్లుగా కురుస్తోంది. గుర్రాలెక్కారు. అవి పెద్దగా సకిలించాయి.

"ప్రభూ! నా ... కంఠాభరణం ..!" నాగులు ఆశగా అడిగింది.

"అక్కడ. తురగా రాముని దగ్గరకు వచ్చి ... రేపు అడుగు. ఆయనే ఇస్తాడు !" అని చామి సెట్టి వ్యంగ్యంగా అంటూ అశ్వాన్ని అదిలించాడు. వాళ్లలా ఆ చీకటిలో అంతర్ధానమవుతుండగా నాగులు నివ్వెరపడి చూస్తూ నిల్చుండి పోయింది. కప్పల బెకబెక ధ్వని దాన్ని చూచి పకపక నవ్వుతున్నట్లనిపించింది.

ఒక్కుమ్మడి సముద్రం విరిగేట్లు ఉరుములు 'ఢుళం ఢుళం' అని ఉరుముతున్నాయి. ఘనఘనా ఘన ఘోషణం హెచ్చింది. వాగుల్నూ వంకల్నూ లెక్కచెయ్యకుండా అశ్వాలు వాయువేగంతో దుముకుతున్నాయి.

"పెద్దనా ! నాకింకా ఒక ఆశమిగిలింది !"

పెద్దన చామిసెట్టివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"అవును ! విషప్రయోగాన్ని గూర్చి కొంత విన్నాను. విష ప్రయోగానికి వాతావరణానుకూల్యత ఉండాలి. ఇట్టి భయంకర వర్షాకాలములో ఆవిషం విశేషంగా హాని చేస్తుందని నేననుకోను!"

పెద్దన గుండెల్లో ఆశలు మోసులెత్తాయి.

రత్నాకరంలోని నీటిని అధికంగా త్రాగి, అంబుదాలు అందలి రత్నాలను అనుగ్రహించుకోలేక నేలపై క్రక్కుతున్నట్లుగా వర్షం పడుతూంది. నభోవిభ స్వాంతరం గంభీర గర్జా విజృంభణాలతో నిండింది.

"అయితే...మన వేమారెడ్డి కింకా ప్రాణాలుండి ఉంటాయనేనా నీ ఊహ?"

"సందేహమెందుకు ?"

"ఆ తురగా రాముడు మన వేమనను ఎక్కడ పారవేశాడో ఎలా తెలుసుకోవడం ?"

"ఇప్పుడటువంటి ప్రయత్నాలవలన ఫలంలేదు. ఎక్కడో నిర్జనారణ్యములో పారవేసి వుంటాడు !"

"ఓసీ! మా వేమారెడ్డి ప్రభువులకు విషమిచ్చినందుకు నీకు ప్రతి ఫలం కూడా గొప్పదే ఉండాలి. నీ వంటి రాజద్రోహి ఏం చేయటానికైన సిద్ధమేనని నాకు తెలుసు. ఈ నేరానికి నీకు మరణ శిక్ష విధిస్తున్నాం!''

మరణశిక్ష మాట వినగానే అది పెద్దగా ఏడుస్తూ మంత్రి పాదాల మీద వాలింది.

"ఓరీ! దీన్ని నా వెంట రాజ భవనానికి ఈడ్చుకొని రండు!'' అని మంత్రి సేవకులను ఆజ్ఞాపించాడు. రాచవేముని దగ్గరకు వచ్చాడు.

"మంత్రిగారూ! ఆమె యెవరు? ఎందుకు ఈడ్చి తెస్తున్నారు?"

తురగా రాముడు నెమ్మదిగా చెప్పాడు.

"ప్రత్యక్ష సాక్ష్యం ప్రభూ! నేను రాత్రి గావించిన మహా కార్యాన్ని మీరు నమ్మరేమోనని దీన్ని ఇక్కడకు రప్పించా!'' అని నాగులు వైపు తిరిగాడు.

''నాగులూ! నీవు చేసిన రాజద్రోహ నేరానికి ధర్మ ప్రభువులైన రాచవేమారెడ్డిగారే తగిన శిక్షణ విధిస్తారు. నీ తప్పును నువ్వే చెప్పు!''

గద్గద స్వరంతో నాగులు పలికింది.

''ప్రభూ! మహా మంత్రిగారు రాత్రి చెప్పినట్లుగానే చేశాను. వేమారెడ్డిగారు పడిపోయిన తరువాత మంత్రిగారే తీసికొని పోయారు. నా తప్పేంలేదు! నన్ను క్షమించి, ధర్మ ప్రభువులే రక్షించాలి!''

రాచవేమన సంతృప్తితో మంత్రివైపు చూశాడు.

మంత్రి కన్నుతో ఏదో చెప్పాడు "ఓసీ రాక్షసీ! నీ తప్పుకు ఎంత శిక్ష విధించినా తప్పులేదు. కానీ స్త్రీ వవటంవల్ల బ్రతికి పోతున్నావు. ఓరీ! ఎవరక్కడ! దీన్ని తీసికొనిపోయి నాలుకను కత్తిరించండి!" అని ప్రభువు కేక వేశాడు.

ఇద్దరు భటులు వచ్చి శోక రాగాలు తీస్తున్న నాగుల్ని ఈడ్చుకొని పోయారు.

"మహాప్రభూ! మీ తెలివే తెలివి! చక్కని తీర్పునిచ్చారు. ఇక మన రహస్యం ఎవరికీ తెలియదు!'' అని తురగా రాముడు రాచవేముణ్ణి మెచ్చుకున్నాడు.

ఇంతలో ఆ భవనం వెనుకనుంచి 'కెవ్వు'న కేక విన బడింది.

ఆ కేక నాగులుది.

రాచవేముడు మంత్రిని జూచి చిరునవ్వు నవ్వాడు!

(సశేషం)

---

# "ఓ వనితా!

శ్రీమతి బి. స్వర్ణాంబ

ఓ వనితా!
ఇనుప గుగ్గిళ్ళు వండిన వనితవు నీవు!
రాళ్లల్లో బియ్యాన్ని ఏరి వండగలవు!
కానీ ఆ బియ్యంలో రాళ్లు కలిపే కల్తీ వ్యాపారుల నెదుర్కోగలవు
యమునితో పోరాడి మగని ప్రాణాలు గెలిపించుకున్నావు!
కల్తీ మందులతో ప్రజల ప్రాణాలు తీసేవారిని దండించగలవు
నరకుని పైకి యుద్ధానికి వెళ్ళిన దానవు!
అవినీతి పరులైన నరుల నెదుర్కోగలవు
త్రిమూర్తులనే పసిపాపలచేసి బువ్వ పెట్టినావు!
అన్నార్తులైనవారి నాదుకోగలవు
రవి రాకను ఆపి లోకాన్ని చీకటి చేసిన దానవు!
చీకటి బజారు నడిపి రవిలా వెలిగే వారికి రాహువు కాగలవు
కని పట్టిన భర్త వదలివెడితే సహించని దానవు.
దేశానికి అకని పాతాల్లాంటి కష్టాలు కలిగించే వారిని దండించగలవు
దొంగతనంగా విన్నె త్తుకపోయి చెరపట్టిన వాణ్ణి చంపించావు?
దేశ లక్ష్మిని దొంగతనంగా అమ్మేవాణ్ణి చెరసాల పాలు చేయ గలవు
సభలోనే గౌరవాన్ని మంటగలుపుతూంటే రక్షించుకున్నావు!
దేశగౌరవాన్ని రక్షించని వాణ్ణి నాశనం చేయగలవు?
రణరంగంలో ఆంగ్లేయుల నెదిరించిన దానవు.
మారణ హోమం చేసే క్రూరుల్ని ఎదుర్కోగలవు?
అందుకే ఈ దేశానికిది సరి క్రొత్త ఆశలయుగాది!
అవుతున్నది కొత్తమనసులతో నవశకానికి ఆది!!!

# గ్రంథసమీక్ష

## ప్రేరణ

[ రచన : శ్రీ కె ప్రభాకర్; రవి ప్రచురణలు. హైదరాబాదు-4 డెమీ 60 పేజీలు; వెల రూ 3-00 ]

ద్విపద సంప్రదాయం తెలుగులో వున్నా, ఎన్నో ప్రబంధాలు ద్విపదలో రచించబడినా, ఎందుకో ఆ ఛందస్సుకు అంత ప్రాచుర్యం ఆదరణ కలగలేదు నిజానికి ద్విపద పాడితే బాగుంటుంది. చదువుకోడానికి ద్విపద ఎలాగో వుంటుంది. వచన కవిత చదవగలం గాని ద్విపద చదవలేం.

అయితే ఉరుదూ సాహిత్యంలో ద్విపద (షేర్) మంచి పేరు పొందింది. దానికి ప్రజాదరణ అందింది. రెండు పంక్తులలో ఒక భావాన్ని సంపూర్ణంగా చెప్పడం ఉర్దూలోను, పారసీలోను ఒక సంప్రదాయమై పోయింది. 'గజల్' లోగాని నజంలో గాని షేర్‌లు (ద్విపదలు) వుంటాయి. సంఖ్య సమయానుకూలంగా మారుతుంది.

ప్రభాకర్‌గారు ఉరుదూ "షేర్" ప్రక్రియను అనుసరించినట్లు "ప్రేరణ" చదివినేను భావిస్తున్నాను. అయితే ప్రభాకర్‌గారు గజల్ ఛందస్సును అనుసరించలేదు. రెండు పంక్తులే అయినా తేటగీతి లేక ఆట వెలది ఛందస్సును గాని ప్రేరణలో అనుసరించడం జరుగలేదు.

అక్కడక్కడా త్రిశ, మిశ్ర, చతురస్ర మాత్రా గణాలు కనపడతాయి, కాని కవి వాటిని కూడా విధిగా పాటించలేదు. కనుక ప్రేరణలోని ద్విపదలు పద్య గంధి వచన పంక్తులనడంలో తప్పులేదు.

ఉర్దూ షేర్‌లలో వలె అంత్యనియమం పాటించారు ప్రభాకర్ గారు చాలా చోట్ల. ఉదాహరణకు

"చిలిపి తలపులేనాకు ప్రేరణ
వలపు పిలుపులే నాకు జాగరణ"

ఇక ఇతి వృత్తం విప్రలంభం. ప్రణయినీ వియోగ వేదన అడుగడుగునా ధ్వనిస్తుంది.

వలపు బాధ ఇంతింత కాదు సుమా
తెలుపుటకు ఏ భాషయైన లేదు సుమా
"నా యొక్క దిల్‌కి దర్
కొంతైన విప్పి చెప్పగల'

"నా మనో వేదనను ఉర్దూ కొంతైనా విప్పి చెప్పగలదు'' అన్నారు ప్రభాకర్‌గారు. నిజానికి మనో వేదనను కొంత వరకే వ్యక్త పరచగలం. ఏ భాషలోనైనా వ్యక్త పరచ లేని వేదన చాలా మిగిలి వుంటుంది. అంతే విప్రలంభాన్ని ప్రకటించడానికి ఉరదూ చాలా అనువైన భాష అన్నంత వరకు నేనూ అంగీకరిస్తాను.

ఈ కవి తన కావ్యం మొదటనే ఒకద్విపద చెప్పారు. ద్విపద అంటే నా అభిప్రాయం రెండుపంక్తులు. అని మాత్రమే.

"ప్రణయ పంకాన పడని వారుందురాలోకాన
పడి విరహగీతాలు రాయకుందురా శోకాన'' అన్నారు కవి.

ప్రణయంలో పడని వారు అరుదే ఈ లోకంలో. కాని దాన్ని పంకం అనవలసిందేనా?

శోకంతో విరహగీతాలు వ్రాయడం బాగానేవుంది.

"చిగురాకుల చెంత ముదురాకుల వొంత
నే కాంచిన కాంత రగిలించెను చింత''

ఈ పంక్తులు కవి రచన శక్తిని, అనురక్తిని వ్యక్తంచేస్తున్నాయి. ఇలాటి చక్కని కప్లెట్స్ "ప్రేరణ"లో అనేకం.

అందని ప్రేయసి కోసం పడే ఆరాటంలో నుంచి సుందర కవిత ఉద్భవిస్తుందనడానికి ప్రభాకర్ గారి 'ప్రేరణ' నిదర్శనం. నిజానికి ఆ విరహ వేదనే రచనకు ప్రేరణ.

"నేను లోకము విడచిన తరుణం
మీకగా మిగిలేది నా ప్రేమాభరణం"
"నా బాధే కవిత్వం, నా గాథే వ్యక్తిత్వం
నా జీవిత సర్వస్వం విద్యాభ్యాసం"

ఈ పంక్తుల్లో ఈ కవి మనోభావాలు స్పష్టంగా తెలుస్తున్నాయి.

ఈ బాధ పోదని, ఇలాంటి మంచి కవిత్వం ప్రభాకర్ కలం నుండి ఇంకా వెలువడాలని ఆశిద్దాం.

—దాశరథి

## ధార

(రచయిత: శ్రీ అకొండి వెంకటరత్నం. వెల. ఐదు రూపాయలు; ప్రతులకు: న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్. ఏలూరు రోడ్, విజయవాడ-2 )

తెలుగు సాహిత్యంలో వచన గేయానికి రావలసినంత పరిణామం వచ్చినట్లు భావించవచ్చు. జటిల వేదాంత భావన నుండి, కోమల శృంగార వర్ణన దాకా, సర్వ విషయాలకి వచన గేయాన్ని వాహికగా కవులు ఉపయోగిస్తున్నారు. వచన గేయానికి ప్రధా

వంగా ఒకే వస్తువుగాని. సిద్ధాంతంగాని వుండి తీరాలి అనే తీవ్ర వాదాన్ని అలా ఉంచితే, సర్వ వస్తువులకీ ఒదిగే వాహిక వచన గేయం స్వేచ్ఛగా కావలసిన నడకల్ని వినియోగించడానికీ, భావాన్ని ధ్వనింపజేసే రీతి మార్పుల్ని అసంఖ్యాకంగా ప్రదర్శించడానికీ, వచన గేయమే అనంతమైన అవకాశాల్నిస్తుంది. శిష్టా నుండి ఈనాటి కవుల దాకా అనేక రీతులుగా వచన గేయ పరిణామం కనిపిస్తుంది. అందులో సుకుమారమైన భావనాశక్తివి, కోమల సంస్కృత పద బాహుళ్యానికి ఒదిగించి మాధుర్య వేగ ప్రవాహంగా తీర్చి దిద్దడం ఒక ప్రధాన రీతి. స్వర్గీయ బాల గంగాధర తిలక్ ఈ విధానాన్ని ఒక తోవకి తెచ్చినవాడు. శ్రీ ఆకొండి వెంకటరత్నం వ్రాసిన "ధార" కూడా, ఆరీతి ధారకి ప్రతినిధిగా ఉంది.

"నిన్నటి వరకూ నన్ను మరచి
నిబిడాంధ కార మనో మందిరాలు నిర్మించుకున్నవాళ్ళకి
నిర్మల దీప్తులందించడానికి అరుదెంచారు
సహస్ర పత్ర కుసుమంలా వికసించారు
అమావాస్య రాత్రి సూర్యోదయంలా గుబాళిస్తున్నారు"

యిట్లా ఆరంభమైన కావ్యం, వెంకటరత్నంగారి శైలిని ప్రతిబింబిస్తోంది. ఐతే, అవ్యయమైన తెలుగు పదాల సొగసుని సంస్కృతంతో మేళవించడం ఈయన ప్రత్యేకతగా చెప్పుకోవాలి.

"పూల సౌరభాల ఒడిలో
నేలరాలే వెన్నెల తడిలో
కనురెప్పలు కైపుల్ కదిలించినవాణ్ణి
నిర్మల సరోవర జలాల్ని
రాతిబెడ్డలతో బెదిరించిన వాణ్ణి
నేను మానవుణ్ణి"

ఇంతటి శైలీ మాధుర్యంతో, ప్రతి పంక్తినీ భావనా శిల్పంతో Charge చెయ్యడం, ఈ నాటి కవుల్లో చాల కొద్ది మందికే చేతనౌను. అందులో కూడా వెంకటరత్నంగారిది చాలా సుకుమారమైన భావన. రూపకాల మాలలు అప్రయత్నంగా గుబాళించే లోతైన ఊహలు—

"నీడల వాడి సూదులతో
వడగళ్ళ వాన దారాలతో
ఎద సీతాకోక చిలుకకు
కదలకుండా రెక్కలు కట్టి
విశ్వమాన సారామంలో అందాలుకురిపించమంటే ఎలా ?

కొన్ని చోట్ల ఈయన భావనాశక్తి, దాని వ్యక్తీకరణ చాల ఔన్నత్యాన్ని సాధించింది.

"రజనీ బంధంలో, రవి
రవ్వంత విశ్రాంతిలో ఉన్నప్పుడే
సుదూరమానసాలవంటి తారకల్ని
నా హృక్కుల పరిమళాలతో పట్టపగలుగా వెలిగించి
చీకటి పొట్టల్ని పగుల గొట్టడానికి నేను పుట్టాను"

అంటుంది దివ్వె. కొన్ని నూతనమైన, స్వచ్ఛ కవితారూపాలైన Expressions చూడండి.

"ఎగిరే తూనీగ రెక్కల వలే కనిపించకుండా కదిలే
కను రెప్పల చాటు నుంచి"
"ఆకాశాన్ని గుండ్రంగా కత్తిరించుకున్న కలువ రాయడు"
"అటూ ఇటూ పుటలు లేని ఆకాశ పుస్తకంలో అక్షర మేఘాన్ని నేను"
ఆకాశపు నల్ల చీరలో దూరే రాత్రి రాణులు
పగలంతా తలక్రిందులుగా నిదురిస్తాయి"
'గ్లాసెడు వెన్నెల్లో అర గ్లాసెడు సూర్య రశ్మి కలిపి త్రాగినంత నిషా"

ఇట్లాంటివి ఎన్నో. ఐతే, కొన్ని చోట్ల భావానికి బరువై, కేవలం తూగు కోసం వచ్చిన అను ప్రాసలూ, ప్రవాహరూపమైన శైలిలో అక్కడక్కడ బద్ధకంగా ఒళ్ళు విరుచుకునే గద్యమూ — ఈ కవి పోగొట్టు కోవలసినలోపాలు.

సహజంగా యిట్లాంటి సుకుమార భావశైలులతో నిండిన కవి సందేశం, మానవత్వపు దిశలోనే ఉంటుంది. ఆ సందేశమూ, దాన్ని ప్రకృతి సందేశాలతో కలిపి వ్యక్తీకరించే ఈయన విధానమూ చాలా విశిష్టమైనవి. కవి చెప్పు కున్నట్లు ఈ 'ధార'—

"దైన్యం వంటి సాగరం నుంచి మౌనముద్రలో ఉబికే
రవి తేజాన్ని ఎద ఎదకూ పంచే
మధురమైన ధార"

## తంగేడుపూలు

(రచయిత : శ్రీ ఎన్. గోపి. వెల : మూడు రూపాయలు
కాపీలకు : నవయుగ బుక్ హౌస్, సుల్తాన్‌బజార్, కోఠీ, హైదరాబాద్-1లేదా1-9-129/16/1రామ్‌నగర్-హైదరాబాద్-48)

తెలుగు వచన గేయశైలిలో వచ్చిన అసంఖ్యాక మార్గాల్లో, శ్రీ సి. నారాయణరెడ్డి ప్రచలితం చేసింది ఒక విశిష్ట మార్గం. ఆనాటి అభ్యుదయ కవుల్లో చాలా మంది ఈ మార్గంలోనే రాశారు. కానీ యీ నాటికీ శ్రీ సి.నా.రె. అటువంటి రీతిని బాగా ప్రచారం చేస్తున్నారు. ఈ రీతి ముఖ్య లక్షణం రెండేసి పాదాలకి ఏదో

ఒక విధమైన లయ (Balance) ఎక్కువగా కనిపించదం. అది అంత్యానుప్రాస రూపంలో చాలావరకు ఉంటుంది. లేదా ప్రాస రూపంలో, యతి రూపంలో, ప్రాసయతి రూపంలో, ఏదో ఒక విధమైన తూగుని సాధిస్తుంది. దీన్ని వచనగేయ ద్విపద రీతి అవవచ్చునేమో! పదాలన్నీ మెత్తగా, భావాలన్నీ సుకుమారంగా ఉండటం కూడా ఈ రీతిలోని విశిష్టత. యిట్లాంటి మార్గంలోనే నడుస్తుంది శ్రీ ఎన్. గోపి వ్రాసిన "తంగేడుపూలు"

"నీ మౌనం తీగలుసాగి
ఏ పాటమీదికో ఎగిరిపోయింది
పాట కరిగి కరిగి
నిశ్శబ్దంలోకి జారిపోయింది" (నీ పాట)

మెత్తనిశైలి మెత్తని భావన, అభ్యుదయవేదన కలిసి కరిగిపోయిన మార్గం శ్రీ గోపిది. పదాలకున్న మాధుర్యశక్తిని శ్రీ గోపి ఎంతగా పిండుకోగలరంటే, ఒక్కొక్కచోట భావనలో లోతు అవసరం లేకుండానే, పదాల పొందికతో పాఠకుడికి అనుభూతి నందించగలరు. "వానవెలిసిన వేకువ"ని కవి వర్ణిస్తున్నారు—

"తీగెమీద నీటిముత్యాలు నడిచిపోతున్నాయి
తడిరెక్కలల్లారుస్తూ పిచ్చుకలాడుకుంటున్నాయి
పాలకొరలారవేసినట్లున్నదాకాశం
కొబ్బరాకులమధ్య చలిగాలి చప్పుడుచేస్తున్నది—"

శ్రీ గోపి కవిత్వానికి సౌందర్యానుభూతి ఒక కన్ను. సామాజిక వేదన మరో కన్ను. ఈ రెండూ కలిసి ఉండవచ్చునా అంటే, తప్పక కలిసి ఉండవచ్చు. సామాజిక వస్తువుతో రాసే కవి, యితర భావాలేవీ రాయకూడదు అనే సిద్ధాంతం, ఒక ఉద్యమ అవసరంలోనుండ పుట్టే అనవసర భావనే ఔతుంది. శ్రీ గోపి, సామాజిక వేదనతో, నిరుపేదల కష్టాలు వర్ణించేటప్పుడు గొప్ప వ్యంజనశక్తిని ప్రదర్శిస్తారు. అంతేగాక తీవ్ర క్రోధాన్ని కూడా కురిపిస్తారు. "మంచితిండి" అనే గేయం దీనికి గొప్ప ఉదాహరణ. దారుణమైన రోగంతో పసిబిడ్డ నెత్తుకు వచ్చిన పేదరాలికి డాక్టరు చెప్పిన సమాధానం యిది.

"మీవోనికి రోగమేంలేదు
Malnutrition
అంటే తిండి గావాలె
మంచితిండి—"

ఈనాడు కొందరు కవులు సామాజిక కసిని, కవితాత్మ లేకుండా నగ్నంగా చెప్తుంటే, మరికొందరు కవితా శిల్పాత్మకంగా చెప్పగల్గుతున్నారు. ఈ సంపుటికి "ప్రతిధ్వని" రాసిన శ్రీ కుందుర్తి యిట్లాంటి ఖండికల్ని ధ్వని కావ్యాలన్నారు. ఉదాహరణకి గోడ, పిట్టలు, ఎండుటాకులు అనే ఖండికలు




Symbolicగా సామాజిక కసిని వెలువరించి, కసికి కవితాత్మకతని తెస్తున్నై.

అతితీవ్ర భావాన్ని కూడా సౌందర్యంతో మింగెయ్యడమూ ఈ కవిలో మనకి కొన్నిచోట్ల కనిపిస్తుంది.

"మక్కలనందుకునే మా ఊహలను
ఉక్కు కరాలతో నొక్కకండి
గళాల్లో మేలుకున్న పాటలకు, ని
గళాల యుగళాలు వెయ్యకండి"

గేయాల్ని ధ్వనిపూరితంగా తీర్చడమేగాక ఎన్నో పంక్తుల్లో మనకి కవి ధ్వనిశక్తి స్ఫుటంగా కనిపిస్తుంది. చూడండి కొన్ని.

"తడి యిసుకలో
చిన్నారి నవ్వుల్ని పాదుకోసుకుంటున్నారు పిల్లలు"

"తనలోని చీకటిని
ప్రజల మొహాలమీద ఆరవేసుకుంటున్నాడు"

"గదిచూర్లలోని గాలిబూజు
కళ్ళల్లో రాలిపడుతుంది"

ఎటువంటి భావాన్ని చెప్పినా పదసౌకుమార్యం విడకపోవడం ఈయన ప్రధాన లక్షణం. అందుకే శ్రీ ఎన్. గోపి "తంగేడుపూలు"

"మనసున్నపూలు
మమతలున్నపూలు
వలపుబాసలునేర్చినపూలు
పేదపూలు
బంగరుపూలు"

—శ్రీ అద్దేపల్లి రామమోహనరావు.

# మన జిల్లాల్లో ఏం జరుగుతోంది?

## ప్రకాశం జిల్లా

పొదిలి తాలూకాలో వ్యవసాయాభివృద్ధికై పొదిలి వ్యవసాయ భూమి అభివృద్ధి బ్యాంకు 1976 వ సంవత్సరములో బాగా కృషిచేసింది. ఈ కార్యక్రమం క్రింద క్రొత్త వ్యవసాయపు బావులు 31 ఆయిల్ ఇంజన్లు 42, గొర్రెలు అభివృద్ధికై 8 యూనిట్లు (80 గొర్రెలు) మరియు 183 మంది రైతులకు భూములను మరామత్తు చేసికొనేందుకు ఋణాలు మంజూరు చేసినారు. పై కార్యక్రమాలకు మొత్తం రు. 1,86,219- లను ఇచ్చినారు. ఈ కార్యక్రమాలు బీద ప్రజానీకం ఆర్థిక స్థితి మెరుగుపడుటకు తోడ్పడినవి.

పొదిలి స్టేటుబ్యాంకు వారు పొదిలి తాలూకాలోని గుండ్ల సముద్రం హరిజనుల జీవన ప్రమాణం అభివృద్ధి బాగా తోడ్పడ్డారు. ఈ హరిజనవాడలో 63 కుటుంబములు హరిజనులు గలరు. వీరికి ప్రభుత్వంవారు ఇండ్ల స్థలములను యివ్వటమేగాక వారికి శాశ్వతమైన గృహములను కట్టించి వారి నివాస యిబ్బందులను తొలగించినారు. అంతేగాక వారి ఆర్థిక పరిస్థితి పెంచుటకు గాను 48 కుటుంబములవారికి 1976 వ సంవత్సరములో ఒక్కొక్కనికి రు. 709/- ల చొప్పున పాడి పశువులను కొనగోలు చేసుకొనుటకుగాను యిచ్చినారు.

—శ్రీ రామారావు

## అద్దంకి తాలూకాలోని బడుగు వర్గాల వారికి సహాయం

అద్దంకి భూసంస్కరణల ట్రిబ్యునల్‌కు సంబంధించిన ఓగులు భూమి 4181 ఎకరాలలో 606 ఎకరముల భూమిని 944 మంది బలహీనులకు పంచారు. అద్దంకి తాలూకా ప్రభుత్వ బంజరు భూమిని 5667 లు 5084 మంది హరిజనులకు, గిరిజనులకు వెనుకబడిన తరగతుల వారికి ఇచ్చారు. 178 ఎకరముల భూమిని ఇండ్ల స్థలాలకై 3474 మందికి కేటాయించారు. ఇటీవల వర్షాలలో ఇండ్లుకూలిన 651 మందికి 73,920 రు లు యిచ్చారు.

—శ్రీ కె. రామకృష్ణారావు

## దర్శి తాలూకాలో....

దర్శి తాలూకాయందలి రైతులు యిప్పటివరకు సక్రమంగా వ్యవసాయ నిపుణుల సహకారంతో తమ పైరులను సక్రమంగా కాపాడుకొంటూ ఎక్కువ దిగుబడిని పొందగలుగుతున్నారు. ఈ తాలూకా యందలి రైతులు ఈ సంవత్సరం ముఖ్యంగా పొగాకు మరియు నూనెగింజల పంటలను వేసి ఎక్కువ లాభమును పొందారు.

దర్శి తాలూకా యందలి నాలుగు సిండికేటు బ్యాంకు బ్రాంచీలకు అందిన వెనుకబడిన జాతులవారికి మంజూరు చేయవలసిన దరఖాస్తులలో 40 దరఖాస్తులకు దర్శి సిండికేటు బ్యాంకువారు లోనులు మంజూరు చేసి యున్నారు.

దర్శి తాలూకాయందలి వ్యవసాయ ల్యాండ్ మార్టిగేజ్ బ్యాంకువారు నార్మల్ ఎ. ఆర్. డి. మరియు యస్. యఫ్. డి. స్కీముల క్రింద 67,842- రూపాయలు ఋణముల క్రింద మంజూరు చేశారు ఈ కాలంలో వెనుకబడిన జాతుల వారికి ఈ తాలూకాయందు ఇండ్ల స్థలములకుగాని వ్యవసాయ భూములక్రింద గాని భూములను కేటాయించలేదు.

—శ్రీ బి. బలరామయ్య

## అభ్యుదయ పథంలో అటవీశాఖ

ఎండలు తీవ్రంగా వుండే మన దేశంలో చెట్లను పెంచడం ఎంతైనా అవసరమని గుర్తించి, జిల్లా అటవీ శాఖాధికారి శ్రీ. సి. వేణుగోపాల్ "ప్రతిచోటుకు ఒక చెట్టు" అను ఒక ప్రత్యేక కార్యక్రమమును రూపొందించి, సూళ్ళూరుపేట, గూడూరు, వెంకటగిరి రాపూరు తాలూకాల్లోని రైతులకు ప్రభుత్వకార్యాలయాలకు చాలినన్ని మొక్కలను. సరఫరా చేయటకు గాను సూళ్ళూరుపేట తాలూకా ఎకొల్లు గ్రామంవద్ద చింత, వేప, దిరిశ, విద్రగన్నేరు, బూరుగ, జీడిమామిడి, తురాయి, ఎప్సి మొక్కలను శ్రమదాన కార్యక్రమములో పెంచి "వనమహోత్సవ కార్యక్రమమునకు నూతనోత్సాహము గల్పించారు.

అడవిలో ట్రంకు రోడ్డుకు సమీపములో 4 హెక్టార్ల భూమిలో ఆదర్శ జీడి మామిడి క్షేత్రాలు నెలకొల్పి ఎర్రభూములలో కూడా పచ్చని విప్లవం సాధించ వచ్చు నని నిరూపించారు.

—శ్రీ ఎస్. పోలయ్య

## తెనాలి తాలుకాలో సస్యరక్షణ చర్యలు

దాళ్వా పరిసాగులో నున్న తెనాలి తాలూకా గ్రామాల్లోను, రేపల్లె గ్రామాల్లోను వ్యవసాయ శాఖ వారిచే విస్తృత సస్యరక్షణ చర్యలు తీసుకో బడ్డాయి. గోవాడ, పాంబాలవరం, కొవూరు, చెరుకుపల్లి, తుమ్మల పాలెం, సూరేపల్లిగ్రామాల్లో హెలికాప్టర్ ద్వారా "డెమెకాన్" "ఎండోసల్ఫాన్" మొదలగు క్రిమి సంహారక మందులు చల్లారు.

రైతులకు నామ మాత్రమైన ఖర్చు రూ. 3.90తో ఎకరా పొలానికి మందు చల్లబడింది. మిగిలిన రూ. 7-00 ప్రభుత్వం వారు భరించారు. ఈ సామూహిక చర్యల వల్ల 3,000 ఎకరాలలో నివరి పైరుకు సస్యరక్షణ చేయబడింది.

—శ్రీ ఏ. మాధవరావు

బాపట్ల :

20 సూత్రాల ఆర్థిక కార్యక్రమము క్రింద బలహీన వర్గాలకు నిమ్నకులస్థుల వారి ఆర్థిక పరిస్థితి మెరుగుపరుచుటకుగాను జాతీయం గావిడిన బ్యాంకులు విశేషంగా కృషి చేస్తున్నవనుటలో ఎట్టి అనుమానము లేదు. బాపట్ల స్టేటు బ్యాంకు వారు జగన్నాధపురం గ్రామస్థులు 8 మంది వడ్రంగులకు ఆర్థిక సహాయ కార్యక్రమము క్రింద తలా నాల్గు వందల రూపాయలు రుణముగా మంజూరు చేశారు. బాపట్ల ఇండియన్ ఓవర్సీస్ బ్యాంకు మల్లి వారి పాలెంకు చెందిన 48 మంది బలహీన వర్గం వారికి పాడి పశువులు కొనుగోలు నిమిత్తం తలా రూ. 967 అప్పుగా మంజూరు చేశారు

ఇక వ్యవసాయ రంగంలో బాపట్ల, పొన్నూరు పంచాయతీ సమితులు రైతాంగమునకు బాసటగా నిలిచి రూ. 13.50 వేలు ఋణముగా మంజూరు చేశారు.

శ్రీ కె. యల్. నారాయణమూర్తి

సత్తెనపల్లి తాలూకా :

" సత్తెనపల్లి తాలూకా, ఫిరంగిపురం పంచాయతీ సమితి ఆధ్వర్యాన యిటీవల సత్తెనపల్లిలో సాధువమ్మ హాస్టలు ఆవరణలో మహిళా మండలుల పోటీలు నిర్వహింపబడ్డాయి. యీ పోటీలలో సమితిలోని 25 మహిళా మండలుల వారు పాల్గొన్నారు. సమితి స్థాయి మహిళా మండలి వారి నేతృత్వంలో, అల్లిక, కుట్లు, ఎంబ్రాయిడరీ, రంగవల్లులు, పొదుపు, కూరగాయలు పెంపకము పోషక ఆహార విలువలు, వంటలు, పిండి వంటలు, గ్రామ పారిశుధ్యము, ఇంటి పరిశుభ్రత, వయోజన విద్యావ్యాప్తి, కుటుంబ నియంత్రణ ప్రచారము అమలు, మాతాశిశుసంరక్షణ, బిడ్డల పోషణ పెంపకముల పైనను, ఆట, పాటలలోను, పోటీలు నిర్వహించబడ్డాయి. న్యాయ నిర్ణేతలుగా, గుంటూరు జిల్లా, స్త్రీ శిశు సంక్షేమ శాఖాధి కారిణి శ్రీమతి సి. హెచ్. జానకీదేవి, స్థానిక డాక్టరు, శ్రీమతి కె. స్వరాజ్యలక్ష్మి, ఫిరంగిపురం సమితి బి. డి. ఓ శ్రీ యం. సీతారామిరెడ్డి గారలు, వ్యవహరించి పెదమక్కెన, మేడికొండూరు, పాలడుగు గ్రామాలలోని మహిళా మండలులను ఉత్తమమైనవిగా నిర్ణయించారు. సత్తెనపల్లిలోని గిరిజన మహిళా మండలి వారు, రెండునెలల వయస్సుగల ఒక అనాన




పసిపాపను, దత్తత తీసుకొని ఆ పాపకు "మహి" అను ముద్దుపేరు పెట్టుకొని పోషిస్తూ, పెంచుతున్నందుకు, ప్రత్యేక బహుమతిని, అభినందనలను, ప్రశంసలను పొందారు.

—శ్రీ టి. తాతిరెడ్డి

గిద్దలూరు :

గిద్దలూరు తాలూకా కంభము గ్రామమునకు 33 కిలో మీటర్ల దూరమున కాకర్ల గ్రామము నాగుల వరముతో కలసి 4172 జనాభా కలిగి యుంది. ఈ గ్రామములో 56 వాల్మీకి కుటుంబములుగలవు. వీరు వ్యవసాయ కూలీలు. 1969-70 నుండి 1974-75 వరకు ఏర్పడిన క్షామము వలన వీరు దొంగతనము చేస్తూ జీవించుచుండిరి. వీరి దృక్పథములో మార్పు తెచ్చుటకై చేతి నిండపని కలిగించుటకు ప్రభుత్వమాలోచించింది. ఆ గ్రామములో గల సర్వోదయ కార్యకర్త శ్రీ వారణాసి వెంకటకృష్ణమూర్తి 100 ఎకరములను భూదాన యజ్ఞమునకు సమర్పించి దానిని పై వాల్మీకి కుటుంబముల వారికి కేటాయింపు చేయమన్నారు దానము చేయబడినది సారవంతమైన ఎర్రనేల. కాని ఆ భూమిని సాగు చేయవలయునన్న వ్యవసాయ వసతులు, ఇరిగేషను బావులు కావలసియున్నవి.

44 కుటుంబములవారికి ఒక్కొక్కరికి ఎ 2-27 వంతున పట్టాలిచ్చిరి. ఈ పట్టాల జాబితాను భూదాన యజ్ఞము వారంగీకరించిరి.

1975 లో ఒంగోలు జిల్లా కలెక్టరు ఆ గ్రామము భూములను తనఖీ చేశారు. ఈ ప్రజల జీవితమును సుఖవంతము చేసికొనుటకు, దురలవాట్లను మార్చుకొనునట్లు, వారి సంతానమును సక్రమ పద్ధతిలో నడుపుకొనుటకై వారికి సహకార సంస్థను నెలకొల్పుటకు తగిన సహాయమును చేయగలనని అన్నారు.

కలెక్టరు గారిచ్చిన సలహాపై మార్కాపురము డివిజనలు కోఆపరేటివు ఆఫీసరుగారు కాకర్ల కోఆపరేటివు అగ్రికల్చరల్

కాలనై జేషను సొసైటీ యేర్పరచి రిజిష్టరు చేశారు. 1976 లో జిల్లా కలెక్టరుగారు, ప్రకాశము జిల్లా బలహీన వర్గాల వారి భూమి నీటి వనరుల అభివృద్ధి సంఘమునుండి ఒక లక్ష రూపాయలను మార్కాపురము ఆర్.డి.ఓ గారికి సొసైటీలోని భూమిని అభివృద్ధి నిమిత్తం మంజూరు చేశారు. కాలనీకి తీసికొన్న భూమి 104 ఎకరములుంది. గిద్దలూరు తహశీలుదారు ఆ భూమిని వారికి పట్టాలిచ్చిరి. పై లక్ష రూపాయలను 4 యిరిగేషను బావుల త్రవ్వకమునకు భూమిని చదును చేయుటకు, నాలుగు ఆయిలు ఇంజన్లు కొనుటకు, యితర ఖర్చులకు కేటాయించారు. 50 ఎకరముల భూమిని దాదాపు 9 వేల రూపాయల ఖర్చుతో బాగుచేసి 35 ఎకరములలో అరిటి, కంది, ప్రత్తి, మిరప, టొమాటో, జొవర్, పొద్దుతిరుగుడు పంటను పండించారు.

ఒక్కొక్కరికి రూ. 400 వంతున 14 మందికి వ్యవసాయపు పనులను చేపట్టుటకై కేటాయించారు ప్రస్తుతం నిర్ణయించిన నాలుగు బావుల నాలుగు ఆయిలు ఇంజన్లు గాక మరి 6 బావుల 6 ఆయిలు ఇంజన్లకు ప్రభుత్వము గ్రాంటును మంజూరు చేయుట మంచిది. ఎందుకనగా 104 ఎకరముల నీటిపారుదలకు పై నాలుగు బావులలోని నీరు చాలదు. వీరికి ట్రాక్టరు మంజూరుచేయుట మంచిది.

కాకర్ల గ్రామమునకు నాలుగు కిలోమీటర్ల దూరమున ఈ భూములున్నందున ఆ పొరములోనే వాల్మీకులకు గృహ నిర్మాణము చేపట్టుట ఎంతో అవసరము.

శ్రీ జి. వెంకటస్వామి వాల్మీకుల బాలబాలికలకు చందాల ద్వారా హాస్టలును నడుపుతున్నారు. త్వరలో ప్రభుత్వమువారు హాస్టలును మంజూరు చేయగలరని ఆశిస్తున్నారు.

శ్రీ బి. వి. కృష్ణారావు.

## ఆదిలాబాదులో సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ

సన్నకారు రైతులకు గ్రామీణ రుణభారము నుండి విముక్తి కలిగించి వారి జీవన గమ్యమును మెరుగు పరచటానికి సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ ఆదిలాబాదు జిల్లాలో తేది 25-3-1975 రోజున వెలసింది. దీని లక్ష్యము 50 వేల సన్నకారు రైతు కుటుంబములను అభివృద్ధి పరచడము. దీనికి గాను కేంద్ర ప్రభుత్వము రూ.150 లక్షలు గ్రాంటు యిచ్చింది. ఈ సంస్థ నిర్మల్, లక్సెట్టిపేట్, ఆసిఫాబాదు, వాంకిడి, ఉట్నూరు మరియు బోద్ పంచాయతి సమితి ప్రాంతాలలో 29,448 సన్నకారు మరియు చిన్న రైతులను గుర్తించినది. కేంద్రీ ప్రభుత్వము వారి ఆమోదము లభించిన తర్వాత మిగతావారిని ఆదిలాబాదు, మధోల్, ఖానాపూర్, చెన్నూరు మరియు సిరిపూర్ పంచాయతీ సమితులలో గుర్తించ గలదు. ఈ సంస్థ యొక్క లక్ష్యమును పూర్తిగ ఐదవ పంచవర్ష ప్రణాళిక మొత్తంలో నెరవేర్చ వలసియున్నది.

ఈ సంస్థకు ఇప్పటి వరకు రూ. 12.5 లక్షల నిధి కేటాయించ బడింది. దీనితో 280 సేద్యపు నీటి బావులకు రూ. 2.16,267 00 లు 129 ఆయిల్ ఇంజనులు మరియు పంపు సెట్లకు గాను రూ. 1,27,888.00లు, 543 వ్యవసాయపు ఎద్దుల జతలకు రూ. 1.74,319 00 భూమిఅభివృద్ధికి గాను రూ. 7,6?0,00 లు. 530 వ్యవసాయ ప్రదర్శన క్షేత్రములకు రూ. 77.225.00 లు, 19 వ్యవసాయ పని ముట్లకు (స్ప్రేయర్లకు మరియు డస్టర్లకు) గాను రూ. 2,443.00, 176 పాడి పశువులకు రూ. 51,83?.00 లు మరియు గొర్రెల పెంపకమునకు రూ. 4,780.00 లు సబ్సిడీ రూపముగా ఇవ్వడము జరిగింది. రూ. 4,500.00 లు సహకార సంస్థలలో సన్నకారు రైతులు వాటాదారులుగా ఉండటానికి సన్నకారు రైతులకు రుణముగా ఇవ్వడం జరిగినది. ఈ సంస్థ నిర్వహణలో రూ. 1.82,221 00 ఇప్పటి వరకు ఖర్చు అయినది. ఈ విధంగా మొత్తము ఖర్చు రూ. 8.52,251.00 లు అయినది. దీని ద్వారా 1664 గురు సన్నకారు మరియు చిన్నకారు రైతులకు లాభం కలిగింది. ఆసిఫాబాదు, ఇందరవెల్లి మార్కెటు యార్డులలో గోదాములు నిర్మించుటకుగాను ఒక లక్ష రూపాయలు ఇవ్వటానికి ఈ సంస్థ మీటింగులో ఆమోదము జరిగినది.

శ్రీ డి.వి. గోపాలరావు.

## గుత్తికాలూకాలో పుల్లేటివంక రిజర్వాయరు

1977 సం. గుత్తితాలూకాకు శుభోదయము, ఒక ప్రక్క కమాండు ఏరియా అభివృద్ధి - మరోప్రక్క క్షామప్రాంతాల అభివృద్ధి సంస్థ డి. పి. ఎ. పి. వారిచే రిజర్వాయరు నిర్మాణము. అందుకే అనంతపురము జిల్లాలో అప్రతిహతంగా పురోగమిస్తున్న తాలూకాలో గుత్తి ఒకటి.

ప్రత్యేకించి ఈ సంవత్సరంలో. నూతనోత్సాహము, నవోల్లాసము పుంజుకున్న గ్రామము — మామిడూరు ఈ గ్రామము అనంతపురము — గుత్తి మార్గమధ్యమున, అరువది నాలుగవ మైలు రాయి నుండి ఐదు కిలోమీటర్ల దూరమున వుంది— పుల్లేటి వంక అను వాగు ఈ గ్రామము మీదుగా ప్రవహిస్తున్నది. ఈ వంకకు నీరు ఎర్రతిమ్మరాజు చెరువు నుండి లభించును. ఈ నీరంత తుదకు పామిడి వద్దగల పెన్నానది పాలయ్యేదిది. మామిడూరు రైతులు, అనాది నుండి ఈ నీటి సౌలభ్యము పొందలేక సరిగా పండించలేక నిరాశ నిస్పృహలతో వేసారివున్న సమయమున అనంతపురము నీటిపారుదల విభాగము వారి యజమాన్యమున, కలెక్టరు గారి సౌజన్యంతో రాష్ట్రీ డి. పి. ఎ. పి. సంస్థ సిఫార సుతో, ప్రపంచ బ్యాంకు ఆర్థిక ఆశీస్సులతో, ఇరువది ఆరు లక్షల వ్యయముతో, ఇరువది అంశముల ఆర్థిక సూత్రములను ప్రాతిపదికగా చేసికొని, ఈ ప్రాంత రైతులకు వరప్రసాదినిగా వర్ధిల్లుటకు పుల్లేటి వంకకు రిజర్వాయరు నిర్మాణము జనవరి నుండి జరుగు చున్నది.

ఈ రిజర్వాయరు విస్తీర్ణము210 -75 చ. మైళ్ళు వుండును. ఈ నిర్మాణము పూర్తి అయిన తర్వాత ఇందులో 2.418 మిలియన్ల క్యూబిక మీటర్ల నీరు నిలువ వుంటుంది. రిజర్వాయరు కట్ట పొడవు

మొరవతో సహా 1620 మీటర్లు వుంటూంది దీని ఎత్తు 1 మీటరు మొదలు 8 మీటర్ల వరకు కట్టబడును – రిజర్వాయరకు రెండు తూములు రెండు కాలువలుండును. కాలువల పొడవు 3200 మీటర్లు–కుడి కాలువ క్రింద వంద ఎకరములు ఎపుడూ తరీగా వుండునట్లు రెండు పంటలు పండునట్లు ఏర్పాట్లు జరుగుచున్నవి. కుడి కాలువ విశేషమేమనగా దీని కింద సాగు అగు భూములలో తొంభై పాళ్లు హరిజనులు, వెనుకబడిన తరగతుల వారికి చెందినవి. ఎడమ కాలువ క్రింద 573 ఎకరములు సాగులోనికి వచ్చును, ఆరుతడి పైర్లు ఆధునాతన పద్ధతిలో అత్యుత్తమంగా పండించుటకు రాష్ట్ర నీటి పారుదల శాఖ మరియు వ్యవసాయశాఖ వారు అంచనాలు తయారుచేయుట గమనార్హము–ఇక్కడ కూడ కొంత వెనుకబడిన తరగతుల వారిదే.

మునుపటివలె వర్షపు నీటితో నిండు చెరువుల నీరుకాక, ఈ రిజర్వాయరు ఈ ప్రాంతమునకు వరం. ఇన్నాళ్లు బీటలు వారి పాడైపోయిన భూములు సస్యశ్యామలమై ఈ ప్రాంతాన్ని సుభిక్షము చేయగలవు. ఇది వరలో, పై గ్రామాల చెరువుల అదనపు నీరు మొరవలపై వురికి వస్తున్నప్పుడు, ఎర్రగుడి, అనగాన దొడ్డి, ఉప్పరదొడ్డి ప్రజలు అరచేతిలో ప్రాణాన్నుంచుకొని మసలు కొనువారు. ఆ వూరు వరదలో, బురదలో కొట్టుకొని పోయెడి భీతావహమావరించి వుండెను. ఈ భయము, బాధను తొలగించు నిమిత్తము రిజర్వాయరు కట్టను అవసరమైన చోట తొమ్మిది మీటర్లు ఎత్తుకు పెంచడము జరిగినది. ఒక వేళ వర్షా కాలములో ఈ వుల్లేటి వంక నిండుగా పారి, పై నీళ్లు విచ్చల విడిగా వచ్చినా రిజర్వాయరులో పడిన ఈ నీటిని మళ్లించుటకు 384 మీటర్లు పొడవు గల మొరవ నిర్మాణము తయారవుతూ వున్నది–అనవసరమైన అదనపు నీరు ఈ మొరవ ద్వారా పామిడి గ్రామము ప్రక్కన పారు పెన్నా నదిలో కలిసిపోవును

రిజర్వాయరు పనిలో ప్రతిదినము వెయ్యిమంది కూలీలు పనిచేయుచున్నారు బుల్‌డోజర్లు, రోలర్లు, ట్రక్కుల హడావిడి చెప్పనలవికాదు. వెయ్యిమంది కూలీల సంరంభము కనబడుతుంది.

1978 మార్చి వరకు ఈ పని కొనసాగుతుంది. పెద్దలు తనిఖీ చేసిన సందర్భముగా కూలీలు తమ కోర్కెలను విన్నవించు కోగా కలెక్టరుగారు వీరికి చౌక ధాన్యపు డిపోను మంజూరు చేశారు.

—శ్రీ డి.యస్. కృష్ణమూర్తి

## భూగర్భ జలాల పంపిణీద్వారా నల్లజర్ల సమితిలో అధికాహారోత్పత్తి

ప్రకృతి సహకరిస్తేనే, దేశమైనా, గ్రామమైనా అభివృద్ధి చెందుననుటకు నిదర్శనముగా, పశ్చిమ గోదావరిజిల్లా నల్ల జర్ల సమితి ప్రాంతములో మూడింట రెండు వంతుల భూభాగము మెట్ట ప్రాంతమై యున్నది. వ్యవసాయరంగములో యీ ప్రాంతపు రైతులు, ఆరితేరి, ప్రగతి పథములో ముందడుగిడుచున్నటు వంటి వారు. 10 సంవత్సరాలకు పూర్వమే యీ ప్రాంతములో సహజ నీటి వనరులు లేక, వర్షాధారపు పంటలైన బుడమ, జొన్న, గంటి, చోళ్ళు మొదలుగా గల పంటలు పండించుటకు అలవాటు పడి, ఆర్థికముగా మిక్కిలిహీన స్థితిలోయున్న యీ రైతాంగము స్వయంకృషి వల్లనైతేనేమి, ప్రభుత్వ సహాయ సహకారములు విరివిగా లభించుట వల్లనయితేనేమి, భూగర్భంలో దాగియున్న జలాలను కనుగొని, ప్రభుత్వసహకారముతో గ్రామ గ్రామానికి, విద్యుత్ సరఫరా ఏర్పాటు చేసుకొని, మోటరులను అమర్చుకొని, మెట్ట ప్రాంతమైన యీ ప్రాంతము యీనాడు, పలు పంటల పథకములతో, ఆహారధాన్యములను విరివిగా పండించుటయేగాక, చెఱకు, ప్రత్తి వంటి వాణిజ్య పంటలతో ఏ గ్రామమునకు వెళ్ళిన సశ్య శ్యామలముగా కనులకు నిత్య కల్యాణము పచ్చతోరణాల మాదిరి గోచరించును.

1,28,000 జనాభాగల సమితిలో 46 గ్రామపంచాయితీలు కలవు. అన్ని గ్రామాలకు పొలములకు, అడుగడుగున విద్యుత్ సరఫరా ఏర్పాటు కాబడియున్నది సుమారు 1200 విద్యుత్ మోటారులద్వారాను, ఆయిల్ ఇంజనుల ద్వారాను, ఆధునిక పద్ధతులలో వ్యవసాయము సాగుచేయబడుచూ, భారత దేశంలో ముఖ్యపట్టణము లైన, బెంగుళూరు, కలకత్తా, మద్రాసు మొదలగు పట్టణములకు కూరగాయల ఎగుమతి, మామిడి పండ్ల ఎగుమతి జరుగుచున్నది. ఈ ప్రాంతములో మూడు ఖండసారి చెఱకుపంట అభివృద్ధికి అధిక ముగా దోహదమూ జరుగుచున్నది. సమితి ప్రాంతములో కేంద్ర ప్రభుత్వ భూజలాల సంస్థ పర్యవేక్షణలో పలు ప్రాంతములలో 400 అడుగులనుండి 1000 అడుగుల వరకు భూగర్భ జలాల పరిశో ధనలు జరుపబడి, అధికముగా బోరులు ఏర్పాటు కాబడి యున్నవి. ఈ తోవకు చెందిన మూడు బోరుల క్రింద భూమినేల సన్నకారు రైతులను సహకార సంఘములలో చేర్చి, రాష్ట్ర చిన్న నీటి వన రుల సంస్థ, స్థానిక భూమి తనఖా బ్యాంకు వార్ల ఆర్థిక సహాయ ముతో, సబ్ మెర్సిబుల్ పంపులను ఏర్పాటు చేసి అధికాహారోత్పత్తి మార్గములు ఏర్పాటు గావింపబడినవి. సమితి ఆధ్వర్యములో రెండు గొట్టపు బావులకు మోటారులు ఏర్పాటుగావింపబడి సుమారు 150 ఎకరముల భూమి సాగగుచున్నది.

సమితి ప్రాంతములోని నల్లమాడు గ్రామములో 60 వెల రూపాయలతో నిర్మించిన లిఫ్టు యిరిగేషన్ కో ఆపరేటివ్ పథకము నకు మార్చి 2న రాష్ట్రసాంఘిక సంక్షేమశాఖ కార్యదర్శి శ్రీ యస్ ఆర్. శంకరన్ ప్రారంభోత్సవము చేసి, అచ్చటి ప్రజల ఆనోన్య తకు అమితానందంనొందిరి. ఈ నీటి సరఫరా సంస్థద్వారా 4గురు హరిజన రైతులతో సహా 21 మంది సన్నకారు రైతులు లాభము పొందుదురు.

—శ్రీ ఎం. ఎస్. రావు

## తమలపాకు తోటలు

బాపట్ల తాలూకాలో పొన్నూరు చుట్టుపట్ల గ్రామాలలో తమలపాకు తోటలు విస్తారముగా వున్నాయి చింతలపూడి, మాచ వరం, కజకర్రు, దండమూడి, కొట్టంపూడి, ఆరెమండ, పచ్చల తాడిపర్రు, మున్నగు గ్రామాలలో యీ తోటలు రమారమి 15000 యకరాలలో పెంచబడుచున్నవి. ఈ వాణిజ్యపు పంట సర్వసాధార ణంగా నల రేగడి భూములలో వేయబడుతుంది. భూసారాన్ని బట్టి

తమలపాకులు వారం నుండి రెండు వారాలపాటు నిల్వ వుంటాయి. తమలపాకులలో రకములున్నవి. అరవేత ఆకులతో కిళ్లీలు కట్టారు కారా ఆకులు కూడా వాడబడుచున్నవి. కానీ వాటి వాడుక తక్కువ.

తమలపాకు తోటల పెంపకానికి మెట్టభూమి చాల వసతైనది. అందుకని, పై చెప్పబడిన గ్రామాలలో మాగాణి పూడ్చి మెరకచేసి యీ తోటలు వేయబడినవి. మరొక ముఖ్యావసరము మంచినీరు విద్యుద్యంత్రముల సాయముతో యీ తోటలకు నీరు పెట్టబడు చున్నది. ఒక గొట్టపు బావి షెడ, మోటార్ మొత్తం సుమారుగా రూ 7 వేలు ఖరీదు వుంటుంది. ఒక బావి 4 యకరాలకు నీరు అందించగలదు. ఒక యకరం భూమికి నీరు యిచ్చుటకు సాలుకు సుమారు 400/- విద్యుచ్ఛక్తి ఖర్చు కాగలదు.

ఇతర ప్రాంతాలనుండి అనగా తూర్పు గోదావరి, తుని, కడప, నెల్లూరు, కర్నూలు నుండి వచ్చిన రైతులు యిచ్చట భూములను మక్తా తీసుకొని తమలపాకు తోటలు వేస్తున్నారు. ఈ విధంగా యితర ప్రాంతం నుండి పొన్నూరు పరిసర గ్రామాలకు వచ్చి తమలపాకుల సేద్యం చేసున్నవారివి 10 వేల కుటుంబాలు కలవు: యకరం కౌలు రూ 3000 నుండి 4 వేల వరకుంటుంది. అందువల్ల కొద్ది సెంట్ల భూమిని వీరు కౌవులకు తీసికొంటారు. తమలపాకు సేద్యం 3 సం॥లు, చాలా వ్యయంతో కూడిన పని ఎకరం కౌలు సుమారు 4000 కాగా వ్యవసాయపు ఖర్చులు మరొక 4000 అవుతాయి. ప్రతి ఎకరానికి నాలుగు వేల గంటలు అవసరమవుతవి. వాటి కిమ్మత్తు రు 4000 ఏడాది పొడవునా ఎకరమునకు నేర్పరులైన 5 గురు కూలీల వసరమంటుంది. వీరికి వేతనం కూడ ఎక్కువే. ఒక్కొక్కరికి రూ 6 నుండి రూ. 8 వరకు కూలీయివ్వాలి. మొదటి సం॥లో 6 మాసాల వరకు పంట వుండదు. తర్వాత 6 మాసాలలో సుమారు 1000 బుట్టల ఆకుకోత వస్తుంది. రెండవ సంవత్సరము ఆకు దిగుబడి పెరుగుతుంది. 3000 నుండి 3500 బుట్టలు. మూడవ సంవత్సరం 2500 నుండి 3000 బుట్టల వరకు ఆకు దిగుబడి వుంటుంది. ఒక బుట్టకు మూడువేల ఆకులుంటాయి.

సర్వసాధారణంగా తుపానుల వలన యీ తోటలకు విపరీత నష్టం కల్గుతుంటుంది. కానీ యిది లాభసాటి అయిన వాణిజ్యపు పంట.

దీనికి అనుసంధాన పరిశ్రమ బుట్టల అల్లకం, మునుదురు గ్రామం మొదలు పొన్నూరు వరకు బస్సు మార్గమునకు యిరువైపుల బుటలు అల్లబడుచుండుట మనము చూస్తుంటాము. సుమారు 150 కుటుంబాలు ఈ బుట్టల అల్లకపు వృత్తి చేయుచున్నారు. వీరు యితర జిల్లాల నుండి యిచటకు వచ్చినవారే. రోజుకు రమారమి 6 వేల బుట్టలు తయారు చేయబడుచున్నవి. ఇది చాలని రోజులలో యితర జిల్లాలనుండి బుట్టలు తెప్పించబడుచుండును.

వీరి సంక్షేమం కొరకు ప్రభుత్వం వారు ఉచిత నివేశన స్థలాలు మంజూరు చేయమన్నారు.

సన్నకారు రైతులైన ఈ కౌల్దారులకు సౌకర్యము కలుగజేయుటకై ఆంధ్రా బ్యాంకు వారు క్లస్టరు బ్రాంచిని చింతలపూడి గ్రామంలో ఏర్పాటుచేశారు. దీని వలన రైతులు, కూలీలు, బుట్టల అల్లకందారులు, కమీషను వ్యాపారులు చాల ప్రయోజనమును పొందుచున్నారు.

ఇచట నుండి దక్షిణ రాష్ట్రాలకేగాక, ఉత్తర హిందూదేశమునకు కూడ రోజూ లక్ష రూపాయలు విలువచేసే తమల పాకులు లారీలపై ఎగుమతి అగుచున్నది.

1975 ఆగస్టు 18 న ఐ.సి.ఏ.ఆర్. న్యూ ఢిల్లీ పాథలాజికల్ సర్వే సబ్ కమిటీ సభ్యులు చింతలపూడి గ్రామ తమల పాకు తోటలను దర్శించి, ఆకులపై వచ్చు మచ్చలవ్యాధి. "విల్ట్" వ్యాధి చూచి సమీక్షించే రైతులు తీసికొనవలసిన చర్యలను గురించి చెప్పారు. రైతుల కోర్కెపై చింతలపూడియందు గానీ బాపట్ల వ్యవసాయ కళాశాలయందు గానీ తమల పాకు పరిశోధన విభాగము ఏర్పాటు చేయుటకు వారు సూత్రప్రాయంగా అంగీకరించారు.

—శ్రీ కె. ఎల్. నారాయణ మూర్తి

## విజయగాథ

అతని పేరు గురివిండ్ పల్లి ప్రసాద్ రావు—హరిజనుడు; వయస్సు 36 సంవత్సరములు. నలుగురు పిల్లలు. స్వగ్రామం పెనుమూడి రేపల్లెకు 3 మైళ్ళు — సైకిలు షాపు నడుపుతున్నాడు. పూర్వం రోజుకు 4, 5 రూపాయల రాబడికన్నా ఉండేది కాదు. యిప్పుడు తన కొత్త సైకిళ్ళతో రోజుకు 15 నుండి 20 రూపాయల వరకు సంపాదిస్తున్నాడు. తన షాపు కూడ సెంటర్ లో తాలూకా ఆఫీసువద్ద పెట్టుకున్నాడు. పిల్లలకు చదువులు చెప్పిస్తున్నాడు. కలిసివస్తే ఆడపిల్లకు పెళ్ళి చేయాలని సంకల్పం. బ్యాంకువాళ్ళకు కట్టవలసిన వాయిదాలు సకాలానికి చెల్లిస్తున్నాడు. యిప్పటికి 3 నెలలకు 900/- చెల్లించవానని చెప్పాడు. కలసివస్తే తొందరగా బ్యాంక్ ఋణం తీరి వేసి మళ్ళీ ఋణంపొంది కొత్త సైకిళ్ళుకొని వ్యాపారం వృద్ధిచేయాలని ఆకాంక్ష.

6 నెలల క్రితం కొత్త సైకిళ్ళ కొరకు బ్యాంక్ ఋణసదుపాయం రాకపోతే బహూశ తన పరిస్థితిలో మార్పు ఉండేదికాదు.

ఆంధ్రా బ్యాంకు మొత్తం 4200/- బలహీన వర్గాల సహకార సంఘంనుండి 1200/- తన పెట్టుబడి 600/- లలో మొత్తం 12 కొత్త సైకిళ్ళు కొన్నాడు మరమ్మతుల నిమిత్తం విడిభాగాలు సామానులు కొన్నాడు.

—శ్రీ సి. వి. యస్ మూర్తి

PUBLISHED BY THE DIRECTOR, DEPARTMENT OF INFORMATION AND PUBLIC RELATIONS GOVT. OF ANDHRA PRADESH HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD

